Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

తన యింట్లో తను తిన్నా...

పంపినవారు:
కె. ప్రభాకరరావు, సూర్యాపేట



# జెమినివారి
# ఇన్సానియత్

దిలీప్ కుమార్ - దేవానంద్ - బినారాయ్
విజయలక్ష్మి — జయంత్ — జయరాజ్ — శోభన సమర్త్
— బదరీ ప్రసాద్ — ఆగా — మోహన కుమార్

హాలివుడ్ నుండి జిప్పీతో కూడ

ఇప్పుడు బారతదేశమంతట ప్రదర్శింపబడుతున్నది

# చందమామ

## ఈ సంచికలో



ఇవిగాక:

ఇంకా హాస్యకథలు, రంగులబొమ్మ కథ - ఫొటో శీర్షికల పోటీ, చిత్రకథ, వార్తలు - విశేషాలు మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.

"చందమామ"లో పాఠకులు పంపే కథలూ, హాస్యాలూ బాగుంటే వేసుకుంటాము. "చందమామ"లో ప్రచురణార్థం పాఠకులు మంచి బొమ్మలనూ, కార్టూనులనూ, కార్టూను కథలనూకూడా పంపవచ్చు. రచనలూ, బొమ్మలూకూడా స్వతంత్రంగా రచించినవై ఉండాలి.


చందా వివరములు:

చందమామ (ఏ భాషలోనైనా)

విడి సంచిక 0-6-0 సంవత్సర చందా రు. 4-8-0

"నా చర్మ రక్షణకు
నిర్మలమైన సబ్బు అగత్యము!"

మైసూరు చందనసబ్బుయొక్క పరిమళ, ఓషధీగుణాలు బిడ్డ శరీరమును పూర్తిగా పరిశుభ్రము చేయుటయే గాక, లేతచర్మము చిట్లి బాధించకుండ చేయును.



'my skin needs
a pure soap!"



# మైసూరు చందన సబ్బు

గవర్నమెంటు సోప్ ఫ్యాక్టరీ
బెంగుళూరు
(మెంబర్ ఐ. ఎస్. టి. ఎమ్. ఎ.)

## నవభారత నిర్మాణానికి

నవ యువతీ యువకులు అవసరం. అట్టి యువతీ యువకులను పొందగల్గిన మాతలు కావాలంటే, మహిళలు సేవించవలసింది

## లోధ్ర

గర్భాశయ రోగనివారిణి

కేసరి కుటీరం లి.
15, వెస్టుకాట్ రోడ్డు,
రాయపేట, మదరాసు - 14.





# LODHRA

FOR LADIES HEALTH

కేసరి కుటీరం లి., మద్రాసు.14

# అదంతా దగ్గుతో ప్రారంభ మైనది...

మొదట తండ్రి దగ్గుతో యింటికి వచ్చాడు.... తరువాత తల్లికి అంటుకుంది. త్వరలోనే పిల్లలు గూడా దగ్గుట ప్రారంభించారు .... దగ్గు .... దగ్గు యీ విధంగా మీ కుటుంబములో సంభవించుకుండా చూడండి. పెర్టుసిన్ టెష్నర్ అరవై సంవత్సరములవైనుంచి అన్ని విధములయిన దగ్గులకు, కోరింత దగ్గుతోసహా, త్వరితముగాను, క్షేమముగాను స్వస్థత చేకూర్చు నివారిణి అని రుజువైనది.




కొనుడు

## పెర్టుసిన్

"టెష్నర్"

అందరు కెమిస్టుల వద్దను లభించును

ఇండియాలో తయారుచేయువారు

**ఇన్ఫా లిమిటెడ్,** పోస్టు బాక్సు నెం. 1041, బొంబాయి-1

దిగువ వారితో చేసుకున్న ఒడంబడిక ప్రకారము

ఎటెఫా లిమిటెడ్, షాన్ లీచ్టెన్‌స్టెయిన్

స్విస్ కస్టమ్ అండ్ ఎకనామిక్ టెర్రిటరీ

ILY-10-TEL

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

---

స్వార్థంవల్ల మనుష్యులు ఎన్నో నీచమైన పనులు చేస్తారు. స్వలాభంకోసం వారు తమ సన్నిహితులను సయితం మోసగించుతారు. అలాంటి వారికి బుద్ధి వచ్చేటట్టు చేయాలంటే వారి స్వార్థానికే దెబ్బకొట్టాలి.

"అనాదరణీయుడు" అన్న కథలో కాశీరాజు కొడుకు, తనతో సమంగా కష్టాలుపడిన భార్యపట్ల చాలా నీచంగా ప్రవర్తిస్తాడు. భార్యపై అనాదరణ వహిస్తాడు. ఆమెవంతు తిండి తాను తింటాడు. తాను అనుభవించే సుఖాలలో తన భార్య భాగం పంచుకుంటున్నదా అని అయినా విచారించడు. బోధిసత్వుడు రాజు చేసిన నీచపు పనులు సభలో బయట పెట్టించటమేగాక, రాణీకి రాజును వదిలెయ్యమని సలహా ఇస్తాడు. అప్పుడుగాని రాజుకు జ్ఞానోదయం కలగదు.

డిసెంబరు 1955



సంపుటి 17
సంచిక 6

# రాజూ - పేదా

అనగా అనగా ఒక గ్రామం
ఆ గ్రామంలో ఒక రైతు
ఆ రైతుకు కల దొక తోట
ఆ తోటకు కల దెంతో అందం.

చక్కని పువ్వులు పూచేను
తీయని ఫలాలు పండేను
మల్లీ మాలతి విరజాజి
అరటీ ద్రాక్షా ఎలమావి.

"ఈ లోకంలో ఏచోటా
సాటిలేనిది నా తోట!"





అనుకున్నా డా ఆసామీ
సందేహం లేదందేమీ.

"నాదే నాదే సంతోషం
జీకే లేని సంగీతం"
అనుకున్నా డా నిరుపేద
తనదే హాయని ఇకమీద.

అయితే ఉందొక కుందేలు
జిత్తులలో పెట్టిన పేరు
తోటని ధ్వంసం చేసింది
దొరకక తిప్పలు పెట్టింది.

రైతు మనసులో సంతోషం
అంతా పోయీ సంతాపం





నిండగ ఆతని తల ప్రాణం
తోకకి వచ్చెనయో పాపం.

అ పూ రేలే రాజును చూసి
పేదరైతు తన గోడు తెలుపగా
"మేమున్నాం భయమెందుకు నీ" కని
రాజు సేనలను నడిపించె.

సేనలతోనే గుర్రాలూ
వాటి వెనకనే వేటకుక్కలూ
ఆర్భాటంగా తోటంతా
నానా హంగామా చేసె.

కుక్కలు చింపిన విస్తరిగా
దిక్కుమాలిపోయెను తోట



(గేయ కథ)

"నేరక సాయం కోరేను!
తోటకు రూపే మారేను!"

అనుకున్నా డా ఆసామీ
అయితే మరి చేసేదేమీ
లేక కర్మమని ఊరుకునీ
నిలిచాడు నోరు మూసుకునీ.

బడుగు జనం తమ కష్టాలు
తామే భరించడం మేలు;
బలవంతులతో వ్యవహారం
మొదటికి తెచ్చునుగా మోసం!



# అట్టవీాదిబొమ్మ

పూర్వం కౌశికుడనే బ్రహ్మచారి ఉండేవాడు. వయోవృద్ధులైన తల్లిదండ్రులను కూడా వదిలిపెట్టి, కౌశికుడు ఎంతో నిష్ఠతో తపస్సు చేసుకోసాగాడు.

ఒకనాడు కౌశికుడు ఒక చెట్టుకింద కూచుని తపస్సు చేసుకుంటూ ఉండగా, చెట్టుమీద ఉన్న ఒక కొంగ అతనిపై రెట్టవేసింది. పట్టరాని ఆగ్రహంతో ఆ బ్రహ్మచారి లేచినిలబడి తలఎత్తి చెట్టుమీద ఉన్న కొంగకేసి చూశాడు. వెంటనే కొంగ గిలగిలా తన్నుకుని చచ్చి కిందపడింది.

మధ్యాహ్నం కాగానే కౌశికుడు బిక్షాటనకు బయలుదేరి ఒక ఇంటికి వెళ్ళాడు. అదేసమయానికి గృహస్థు ఇంటికి వచ్చాడు. గృహిణి తన భర్తకు కాళ్ళు కడిగి, భోజనంపెట్టి, కాళ్ళు ఒత్తి నిద్రపుచ్చి, కౌశికుడికి భిక్ష తెచ్చింది.

కౌశికుడు మండిపడి, "నన్నింతసేపు వాకిట నిలిపి ఉంచుతావా? ఎవరనుకున్నావు?" అని గద్దించాడు.

"నువు కొంగను చంపి తపశ్శక్తిని నాశనంచేసుకున్న కౌశికుడవు కావా, నాయనా? బడలి ఇంటికి వచ్చిన భర్తకు ఉపచారాలు చెయ్యటం భార్యధర్మం కాదా? తెలిసీ తెలియక ఎందుకాగ్రహిస్తావు?" అని అడిగింది గృహిణి.

తాను కొంగను చంపిన సంగతి ఆమెకు తెలిసిందని కౌశికుడు చాలా సిగ్గుపడ్డాడు. "అమ్మా, నాకు ధర్మం ఏమిటో తెలియదు. దయవుంచి చెబుతావా?" అని అడిగాడు.

"నీకు ధర్మబోధ చెయ్యగలవాడు ధర్మవ్యాధుడు. అతను మిథిలలో ఉంటాడు. నువ్వతని దగ్గిరికివెళ్ళి ధర్మం తెలుసుకో!" అన్నది గృహిణి.

కౌశికుడు ఆ ప్రకారమే మిథిలకుపోయి ధర్మవ్యాధుడికోసం విచారించాడు. అతనొక కసాయివాడని తెలియగానే కౌశికుడికి అసహ్యం కలిగింది. కౌశికుడు తన అసహ్యాన్ని అణచుకుని ధర్మవ్యాధుడి దుకాణానికి వెళ్ళాడు.

"బ్రాహ్మణా! నువ్వెందుకు వచ్చావో నాకు తెలుసును. మా యింటికి పోదాం పద!" అంటూ ధర్మవ్యాధుడు, కౌశికుణ్ణి తన యింటికి తీసుకుపోయాడు.

ధర్మవ్యాధుడు ఎటువంటి మాతృభక్తీ, పితృభక్తీ కలవాడో కౌశికుడు అర్థంచేసుకున్నాడు. అతను ధర్మవ్యాధుడివల్ల అనేక ధర్మాలు తెలుసుకుని, ఇంటికి తిరిగివచ్చి, తన తల్లిదండ్రులను ఆదరంతో చూస్తూ తరించాడు.



# అనాదరణీయుడు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో బోధిసత్త్వుడు, బ్రహ్మదత్తుడివద్ద పండితామాత్యుడుగా జన్మించాడు.

ఒక సందర్భంలో కాశీరాజైన బ్రహ్మదత్తుడికి తన కుమారుడిపై కోపం కలిగి, అతన్ని రాజ్యంనుంచి వెళ్ళగొట్టాడు. రాజు కొడుకు, భార్యాసమేతుడై దేశాంతరాలలో చాలా కాలంపాటు అనేక కష్టాలుపడ్డాడు. నిలిచే నీడలేకా, తినటానికి తిండిలేకా భర్త కష్టా లనుభవిస్తుంటే, మహాసాధ్వి అయిన ఆయన భార్య ఎంతో ఓర్పుతో ఆ కష్టాలన్నిటినీ తానుకూడా అనుభవించింది.

ఇలా కొంతకాలం జరిగాక బ్రహ్మదత్తుడు చనిపోయాడు. ఆయన కొడుకు స్వదేశం తిరిగిరావటానికి అడ్డంకి తొలగిపోయింది. తండ్రి చనిపోయినట్టు తెలియగానే రాజు కొడుకు పరమానంద భరితుడయాడు. ఎప్పుడు కాశీ చేరుకుందామా, యెప్పుడు సింహాసనంమీద కూచుందామా అన్న ఆదుర్దాలో బ్రహ్మదత్తుడి కొడుకు అతి వేగంగా కాశీమార్గం పట్టి రాసాగాడు. తన భార్య తనతో సమంగా నడవలేదనీ, తన కష్టాలలో ఆమె భాగం పంచుకున్నట్టే, ఆమె కష్టసుఖాలు తాను పాటించాలనీ ఆ మూఢుడికి తోచలేదు. అందుచేత ఆహార విశ్రాంతులుకూడా పాటించకుండా అతను రాత్రింబగళ్ళు తాను నడిచి, భార్యనుకూడా తనతో సమంగా నడిపించాడు. అతని మనస్సు పూర్తిగా సింహాసనంమీద లగ్నమై ఉండటం వల్ల అతనికి భార్య పడే కష్టాల విషయం పట్టనేలేదు.

మగవాడైతేమటుకు అతను మాత్రం ఆహార విశ్రాంతులు లేకుండా ఎంతదూర మని నడుస్తాడు? భార్యతోబాటు అతనికి కూడా ఆకలివేసింది. ఈ ఆకలితోనే నడిచి నడిచి వారిద్దరూ ఒక ఊరుచేరారు. అక్కడ






కొందరు వీరి దుస్థితి చూసి, "నాయనా, చాలా అకలిమీద నడుస్తున్నట్టున్నారు. ఇంత భోజనం పెడతాం, మూటకట్టుకు పోయి తినండి," అన్నారు.

బ్రహ్మదత్తుడి కొడుకు తన భార్యను ఒకచోట విశ్రాంతి తీసుకోమని, భోజనం పెడతామన్న వారివెంట వెళ్ళాడు. వాళ్ళు అతనికి ఇద్దరు తినే అహారం అకులో పొట్లంకట్టి ఇచ్చారు. ఆ పొట్లం తీసుకుని భార్య వున్న చోటికి తిరిగివస్తూ అతను ఇలా ఆలోచించాడు :

ఈ భోజనం తానూ భార్యా కలిసి తింటే మళ్ళీ రెండో పూటకే అకలివేస్తుంది. తిరిగి భోజనం ఎప్పటికి దొరుకుతుందో? తాను వెళ్ళవలసిన దూరం ఇంకా చాలావుంది. తాను కాశీకి చేరటం ప్రధానంగాని, తన భార్య చేరటం ప్రధానం కాదు. తాను త్వరత్వరగా ప్రయాణం సాగించటానికి ఆమె అసలే ప్రతిబంధకంగా వున్నది. అందుచేత ఏదైనా ఉపాయంచేసి ఈ అహారమంతా తానే తినెయ్యాలి.

ఆ నీచుడు ఈ ఆలోచన చేసినవాడై భార్య ఉన్న చోటికి చేరి, "నువు ముందు నడుస్తూవుండు. నేను కొంచెం కాల కృత్యాలు తీర్చుకుని నిన్ను కలుసుకుంటాను," అన్నాడు. అతని భార్య ఈ మాటలు నిజమని నమ్మి ముందు పోసాగింది. ఆమె సాగగానే రాజకొడుకు ఆహారమంతా తానే తిని, అకులన్నీ వదులుగా మళ్ళీ పొట్లంచుట్టి, గబగబా నడుస్తూ భార్యను చేరుకున్నాడు. ఆమెకు అతను పొట్లం విప్పిచూపించి, "ఈ ఊరివాళ్ళెంత మోసగాళ్లో చూడు. ఉత్త అకులు పొట్లం కట్టి అహారమని ఇచ్చారు!" అన్నాడు.

కాని అతని భార్య నిజం తెలుసుకుని పైకిమాత్రం ఏమీ అనకుండా ఊరుకున్నది. మరి కొంతకాలం ప్రయాణించేసి వారు ఎలాగైతేనేం, కాశీ చేరారు. బ్రహ్మదత్తుడి



కొడుకు రాజ్యాభిషేకం సక్రమంగా జరి పించుకుని రాజైనాడు.

రాజయాక అతడికి తన భార్యనుగురించి ఆలోచించే అలవాటు బొత్తిగా లేక పోయింది. తన కష్టాలను ఎంతో సహనంతో పంచుకున్న భార్యకు తన సుఖాలలో భాగ మివ్వాలని అతనికి తట్టనేలేదు. ఆమె మంచి బట్టలు వేసుకున్నదో, లేదో, సరిగా భోజనం చేసిందో, లేదో, రాజు ఎన్నడూ విచారించిన పాపాన పోలేదు. అందుచేత రాణి కష్ట కాలం తీరిపోయినా పూర్వంలాగే ఎప్పుడూ విచారసముద్రంలో మునిగి వుండసాగింది.

రాజువద్ద పండితామాత్యుడుగా ఉంటున్న బోధిసత్వుడు రాణి విచారాన్ని గమనించి ఒకసారి ఆమెను చూడ బోయాడు. రాణీ ఆయనను ఆదరించి ఉచిత మర్యాదలు చేసింది.

"అమ్మా, తమ కష్టాలు తీరి మంచి రోజులు వచ్చినందుకు రాజుగారు ఎన్నో బహుమతు లిచ్చారు. కాని నీ చేతిమీదుగా నాకు ఈనాటివరకూ ఏవిధమైన బహుమతీ ముట్టలేదు," అన్నాడు బోధిసత్వుడు.

"బాబూ, నేను పేరుకు రాణినిగాని, వాస్తవానికి అంతఃపుర దాసీలకూ నాకూ తేడా ఏమీ లేదు. రాజుగారి కష్టాలలోనే




తప్ప సుఖాలలో భాగంలేని రాణి ఎలాటి రాణి అనిపించుకుంటుందో మీరే చెప్పండి!" అంటూ రాణి, మార్గంలో తన భర్త తన వంతు ఆహారం తనకు పెట్టకుండా ఏవిధంగా తినేసిందీ చెప్పింది. "ఇప్పుడైనా నా భర్త నేను సుఖపడుతున్నానో, లేదో విచారించడు. నేను మంచిభోజనం చేస్తున్నానా, మంచిబట్టలు కట్టుతున్నానా అన్న ఆదుర్దాకూడా ఆయనకు లేదు," అని రాణి కంటనీరు పెట్టుకున్నది.

"అమ్మా, చింతించకు. ఈ విషయం నీ నోట తెలుసుకునేటందుకే నేను వచ్చాను. రేపు నిండుసభలో నిన్ను నేను ఇప్పుడడి

గిన మాటలే అడుగుతాను. నువ్వేమాత్రం జంకక ఇవే సమాధానాలు చెప్పావంటే నీకి విచారం లేకుండా నేను చూస్తాను," అన్నాడు బోధిసత్వుడు.

మర్నాటి సభకు రాణీకూడా వచ్చింది. ఆమెను చూసి బోధిసత్వుడు, "రాణీగారు రాజ్యానికి వచ్చాక భృత్యుల విషయం చూడటమేలేదు," అన్నాడు.

రాణీ పూర్వం బోధిసత్వుడికి చెప్పిన విషయాలన్నీ సభలో చెప్పేసింది. తాను ఆమె వంతు భోజనం దొంగతనంగా తిన్న మాట ఆమె బయటపెట్టేసరికి రాజుకు సభికులలో తీరని తలవంపులయింది.

రాణీ మాట్లాడటం పూర్తికాగానే బోధిసత్వుడు, "రాజుగారికి నీపట్ల ఆదరం లేనప్పుడు, నువ్వాయనను అంటిపెట్టుకుని ఉండటం అనవసరం.

చజే చజంతం, వణ్ణం న కయిరా ;
అపేత చిత్తేన న సంభజేయ్య ;
ద్విజో దుమం ఖీణ ఫలంతి ఞత్వా ;
అంఞం సమేక్ఖేయ్య, మహాహి లోకే.

(విడిచిన వాణ్ణి విడిచిపుచ్చు, అలాటి వాడి స్నేహం వద్దు ; విముఖ మనస్కుణ్ణి సంభావించకు ; పక్షి ఫలాలులేని చెట్టును విడిచి ఇతర చెట్లు చూసుకుంటుంది. లోకం విశాలమైనది )

అందుచేత నువు ప్రపంచంలోకి వెళ్ళి పోయి ఆదరం లభించే చోటు చూసుకో వటం మంచిది," అన్నాడు.

వెంటనే రాజు సింహాసనంనుంచి దిగి వచ్చి బోధిసత్వుడి కాళ్ళపైబడి, "పండితా మాత్యా, నా తప్పు క్షమించండి! నా పరువు కాపాడండి! జరిగిందేదో జరిగిపోయింది. ఇకముందు నా భార్యపట్ల న్యాయంగా ప్రవర్తిస్తాను," అని కన్నీళ్లతో క్షమాపణ వేడుకున్నాడు.

ఆదిమొదలు రాజు రాణిని ఆదరంతో చూస్తూ సుఖంగా జీవించాడు.






6

[శివదత్తుడి సలహాప్రకారం, సమరసేనుడు తానే స్వయంగా సేనానాయకత్వం స్వీకరించటానికి, అంగీకరించాడుగదా? సైన్యసమీకరణకు సంవాహనుణ్ణి పంపాడు. అతడు సైనికుల, ప్రజల చేతుల్లో దెబ్బలుతిని తిరిగివచ్చాడు. గత్యంతరంలేక, రాజప్రాసాద రక్షణకు మృగశాలాధిపతి, క్రూరమృగాలను బోనుల్లోనుంచి బయటకు వదిలాడు. తరవాత—]

సమరసేనుడు తనను ప్రశ్నించిన విధం, శివదత్తుడు చెప్పగా విని, మందరదేవుడు చిరునవ్వు నవ్వాడు.

"పట్టణ ప్రాకారాల కావల విడిసివున్న శత్రువులకూ, పట్టణంలో రెచ్చిపోయిన ప్రజలకూ కూడా, కావలసింది రాజు గద్దె దిగటం! తరవాత రాజ్యాధికారాన్ని ఎవరు వశం చేసుకున్నా ఫలితం ఒకటేగదా?" అన్నాడు మందరదేవుడు.

"అవును," అంటూ తలవూపాడు శివదత్తుడు. "అప్పట్లో సమరసేనుడికి యింత సూక్ష్మంగా ఆలోచించేందుకు, సరిఅయిన అవకాశం చిక్కలేదు. అంతా గందరగోళంగా వుంది. అందుకే నేను, "అవును సమరసేనా, అదే ప్రస్తుత పరిస్థితిగా కనబడుతోంది! నన్నడిగితే రాజ్యాధికారాన్ని పరులపాలు చేయటంకంటె, రాజును పదవినుండి తొలగించి, యీ ప్రజల సహాయంతో శత్రువుల మదమణచటం ఉత్తమమంటాను," అన్నాను.

"అదే నేనూ అనుకుంటున్నది! చిత్రసేనుడు వృద్ధుడు, వంశోద్ధారకుడుకూడా



లేదు. ఆయన సింహాసనం పరిత్యజించేందుకు అంగీకరించగలడని భావిస్తాను. ఒకసారి ప్రజలు శాంతించిన తరవాత, అప్పుడు పట్టణ ప్రాకారాల వెనక వున్న శత్రువులను ఓడించటం ఏమంత కష్టం కాదు," అన్నాడు సమరసేనుడు.

మేం యిలా మాట్లాడుతున్నంతలో చిత్రసేనుడు అక్కడికి రానేవచ్చాడు. ఆయన రావటం చూచిన ప్రజలు, ఒక్కపెట్టున, "రాజు నశించాలి, రాజరికం నశించాలి!" అంటూ అరవసాగారు.

చిత్రసేనుడు సరాసరి మే[illegible] వున్న చోటుకు వస్తూనే, "సమరసేనా, కోట బురుజు మీద నిలబడి చూస్తే, బయట గుడారాలు వేసుకుని దాడిచేసేందుకు సర్వసన్నద్ధంగా వున్న వందలాది శత్రువులు కనిపించారు. ఇక పట్టణప్రజల క్రోధోద్రేకాలు నాకు తెలియనివికావు. తన వినోదాల్లో, విందుల్లో మునిగిపోయి, ప్రజల బాగోవులను మరచిన రాజు, సింహాసనార్హుడు కాదు. నేను ప్రజలు కోరినవిధంగా రాజ్యపరిత్యాగమే కాదు; అంతకన్న పెద్ద త్యాగమే చేయదలిచాను!" అంటూ మండపం మీదికి వచ్చాడు.

చిత్రసేనమహారాజు ఆ విధంగా మాట్లాడేసరికి, నేనూ, సమరసేనుడూకూడా





నిర్విణ్ణులమయాము. మా నోటివెంట మాట వెలువడలేదు. చిత్రసేనుడు ప్రజల నుద్దేశించి చేతులు ఊపుతూ—"కుండలినీ ద్వీప వాసులారా! మీ అగ్రహాన్నీ, న్యాయమైన మీ కోర్కెనూకూడా నేను గుర్తించాను. నేను భోగలాలసుడనై, మీ యిక్కట్టులను చాలాకాలంగా తెలుసుకోలేకపోయాను. అట్టి నన్ను కిరీటం త్యజించమని కోరటం, ధర్మసమ్మతంగానే వుంది. నేను కిరీటాన్నే కాదు, అంతకన్న గొప్ప విలువైనదాన్నే త్యజించబోతున్నాను. మీరుమాత్రం, మీ నాయకుడైన సమరసేనుడి అజ్ఞలనుపరిపాలించండి," అన్నాడు.

మరుక్షణంలోనే ప్రజలనుండి జయజయధ్వానాలు మిన్నుముట్టినై. ఆ వెంటనే చిత్రసేనుడు మంటపంమీదినుంచి కిందికి దూకేశాడు! అంతా కన్ను మూసి తెరిచేంతలో జరిగిపోయింది. నేనూ, సమరసేనుడూ నివ్వెరపడి కిందకు చూశాము. చిత్రసేనుడు అప్పటికే ప్రాణాలు విడిచినట్టుంది, కదలామెదలటం లేదు.

హఠాత్తుగా అంత ఎత్తునుంచి తమ మధ్యకు దూకిన ప్రాణి ఎవరో తెలియక, భయకంపితమైన క్రూరమృగాలన్నీ చెల్లాచెదరుగా పారిపోయినై.. ప్రజలందరూ నిశ్చేష్టులయారు.






"అంతా అయిపోయింది, సర్వం ముగిసినట్టే!" అంటూ సమరసేనుడు అక్కడ వున్న స్తంభానికి వేలాడపడి పోయాడు. కళ్లలో నీటిబుగ్గ కదుల్లాడింది.

నేను జనంకేసి చూశాను. అంతా నిశ్శబ్దం. హఠాత్తుగా జరిగిన యీ ఘోర సంఘటన వాళ్లను స్తంభీభూతుల్ని చేసింది. సమరసేనుడు స్థాణువులా వుండిపోయాడు. నరవాహనుడిలో చలనం వున్నట్టు లేదు.

అంతలో అక్కడికి మృగశాలాధిపతి పరిగెత్తుకుంటూ వచ్చాడు. "మహాసేనానీ, యిప్పుడు...యిప్పుడు..." అంటూ అతడేమో చెప్పబోయాడు.



నేను అతణ్ణి వారించి, దగ్గరకు పిలిచాను. "ఇక నీ మృగాలనన్నిటినీ వాటి వాటి బోనుల్లోకి వెళ్ళేట్టుచూడు. ఆపని ఎంత తొందరగా జరిగితే అంత మంచిది. ఒకటి రెండు నిమిషాల్లో కోటద్వారం తెరిపించబోతున్నాను. ఈ లోపల మహరాజు భౌతిక కాయం, ప్రాంగణంనుంచి తొలగించి, సురక్షిత ప్రదేశంలో జాగ్రత్తగా భద్రపరచవలసింది," అని ఆజ్ఞాపించాను.

సమరసేనుడు నా మాటలను ఆలకిస్తూనే వున్నాడు. కొంచెం ఎడంగా నిలబడి వున్న నరవాహనుడు, నాకేసి ఓమారు ఓరచూపు చూచి, మంటపంమీదికి వెళ్ళాడు.

కొద్దిసేపట్లోనే క్రూర మృగాలు వాటి బోనుల్లోకి తరమబడినై. చిత్ర[illegible]నుడి భౌతిక కాయం ప్రాంగణంనుంచి తొలగించబడింది. నేనూ, సమరసేనుడూ ప్రాసాదపు మెట్లుదిగి, ద్వారంకేసి బయలుదేరాం.

మేము ద్వారాన్ని చేరేసరికి ప్రజల్లో కలకలం బయలుదేరింది. వారొక్కుమ్మడిగా చేసిన, "సమరసేనుడికీ జై!" అన్న నినాదాలు భూనభోంతరాళాలను బ్రద్దలుచేసినై.

కోటద్వారం తెరువబడింది. సమరసేనుడు ఒకటి రెండడుగులు ముందుకు వేసి, గొంతు సవరించుకొని, "కుండలినీ





ద్వీపవాసులారా !" అని పెద్దగా సంబోధించే సరికి, అంతా నిశ్శబ్దం. "నేను జరిగిపోయిన దానిని గురించి, యిప్పుడు మాట్లాడదలచ లేదు," అన్నాడు సమరసేనుడు. "దేశం అరాజకం పాలయింది, ఆ మాట నిజం! దీనికి ఎవరు ఎంతవరకు బాధ్యులన్నది ప్రస్తుత విషయంకాదు. ఈ నాడు రాజు లేడు, కనక రాజభక్తి ప్రసక్తికూడా లేదు. ఇక యిప్పటి పరిస్థితుల్లో అవసరమైంది, ప్రతి పౌరుడిలో దేశభక్తీ, ఐక్యతాభావం!"

"కుండలినీద్వీపం వర్ధిల్లాలి!" అని ప్రజలు ఏకకంఠంతో అరిచారు.

"పట్టణప్రాకారాల అవతల ప్రబలులైన శత్రువులు పట్టణంమీద దాడిచేసేందుకు విడిసివున్నారు. ముందు పట్టణ రక్షణ, తరవాత దేశరక్షణ! ఆయుధం పట్ట గలిగిన ప్రతి పౌరుడూ ముందుకు రావాలని కోరుతున్నాను!" అన్నాడు సమరసేనుడు.

ప్రజల్లో కలకలం బయలుదేరింది. అందరూ ఒకేసారి ముందుకు తోసుకుంటూ రాసాగారు. "నాకు కత్తి యివ్వండి, నాకు గండ్రగొడ్డలి యివ్వండి, నాకు బాణం అంబులపొదీ..." ఇవీ కేకలు.

సమరసేనుడు వెనుదిరిగి చూచాడు. సమీపంలోనే నిలబడివున్న నరవాహనుడి




మీద అతడి దృష్టి ప్రసరించింది. "నరవాహనా! ఈసారి నీపని సుకరం అనుకుంటాను. సైన్యాన్ని సమాయత్తపరుచు!" అంటూ వెనుదిరిగాడు సమరసేనుడు.

నేనూ, సమరసేనుడూ అక్కడినుంచి కోటబురుజు మీదికి వెళ్ళాం. దూరంగా పుట్టగొడుగుల్లా శత్రువుల గుడారాలు అసంఖ్యాకంగా కనబడినై. చీమల బారుల్లావున్న శత్రుసైనికులు, ఆ గుడారాలముందు విన్యాసాలు చేస్తున్నారు.

"శివదత్తా, శత్రువులు యుద్ధతంత్రం, వ్యూహరచన తెలియని వట్టి మందకాదు. ఆ విన్యాసాలు చూస్తూంటే, వాళ్ళు సుశి



క్షితులైన సైనికులులా కనబడుతున్నారు," అన్నాడు సమరసేనుడు.

సమరసేనుడు చెప్పినదాంట్లో సత్యం లేకపోలేదు. బారులుతీరి యుద్ధవిన్యాసాలు చేస్తున్న శత్రుసైనికుల తీరుచూస్తే, వాళ్ళు సైనికశిక్షణలేని అరాజకజనంలా తోచలేదు.

నేను కోటగోడ వెంటవున్న అగడ్తకేసి చూశాను. అందులో అంతగా నీరున్నట్టు కనబడలేదు. వెంటనే ఒక సైనికుడిని పిలిచి, అగడ్తకు నిండుగా నీరు వదల వల సిందని ఆజ్ఞాపించాను. అప్పుడు సమర సేనుడు నాకేసి తిరిగి, "శివదత్తా, సేనా నాయకత్వం నేను వహించక తప్పదు. పోతే కోట రక్షణభారం నీమీద వదలదలిచాను. నీ అభిప్రాయం ఏమిటి?" అన్నాడు.

నేను వెంటనే ఆ ప్రశ్నకు జవాబు చెప్పలేకపోయాను. కోట రక్షణభారం నేను వహించటం అంటే, శత్రువులమీద దాడికి బయలుదేరబోతున్న సైనికుల వెంట నేనుండే అవకాశం వుండదన్న మాట. అప్పుడు ఉపసేనానిగా, సమరసేనుడి వెంట నరవాహనుడు వెళ్ళే అవకాశం కలుగు తుంది! ఈ చిక్కునుంచి బయటపడటం ఎలా అని నేనాలోచించేటంతలో నర వాహనుడు అక్కడికి రానేవచ్చాడు.




"మహాసేనానీ, రెండువేలమంది సుశి క్షితులైన సైనికులను సమీకరించాను. ప్రజల్లో దృఢకాయుల్ని ఏరి ఒక నాలుగు వేలమందివరకూ ఆయుధాలిచ్చాను. ఇక, యిప్పుడు చేయవలసిందేమిటి?" అని నరవాహనుడు ప్రశ్నించాడు.

సమరసేనుడు నాకేసి తిరిగి, "పట్టణ రక్షణకు, రెండువేలమంది చాలునను కుంటాను?" అన్నాడు. నేను తలవూపాను. "సరే, యీ రక్షణ భారమంతా నీది. నేను రెండువేలమంది సైనికులతో, ఆయుధధారు లైన రెండువేలమంది ప్రజలతో దాడి బయలుదేరబోతున్నాను. మేము బయటికి



వెళ్ళగానే పట్టణ ద్వారాలు జాగ్రత్తగా మూయించవలసింది," అన్నాడు.

సైన్యమంతా పట్టణ ద్వారాలనుంచి బయటికి వెళ్ళిపోగానే, నా పాతికమంది అనుచరులతో నేను రక్షణ కార్యక్రమాలు పర్యవేక్షించసాగాను. ఆయుధాలు ధరించిన ప్రజల వాలకం చూస్తే వాళ్లకు వాటిని ఎలా ఉపయోగించాలో తెలిసినట్టు కనబడలేదు.

క్రమపద్ధతిలో వాళ్ళ నందర్నీ ఒకచోట నిలబెట్టటంకూడా చాలా కష్టసాధ్యమైంది. పైగా, వాళ్ళల్లోవాళ్ళు గిల్లికజ్జాలు పెట్టుకుంటూ, చిన్నచిన్న గుంపులుగా తయారై తగాదా పడసాగారు.

నేను పట్టణ ద్వారాలు మూయించి, కోటబురుజు మీదికి వెళ్లాను. సమరసేనుడి ముఖ్యసైనికభాగం కోటనుంచి వెలువడగానే, శత్రుశిబిరాల్లో కొంత సంచలనం బయలుదేరింది. వాళ్ళు హడావిడిగా ఆయుధ ధారణచేసి, బారులుతీరి యుద్ధ సన్నద్ధమౌతున్నారు. అశ్వికులు పెద్దపెద్ద ఈటెలు ధరించి, కాల్బల సైనికులకు ముందుగా నిలబడ్డారు. కొందరు చిన్నచిన్న ముఠాలుగా ఏర్పడి, సమరసేనుడి సైనిక భాగానికి అన్నివైపులా మెరుపుదాడి చేసేందుకు ముందు కురికారు.

రెండు ప్రధాన సేనలమధ్య యుద్ధం తటస్థపడి, ఫలితం అటో యిటో వెంటనే తేలిపోయే అవకాశం లేదని నేను గ్రహించాను. పదిపన్నెండు మంది శత్రు అశ్వికులు ఒక్కుమ్మడిగా, సమరసేనుడి సైనికుల పైబడి, చేతికి అందినంతమందిని చంపి, ఆవెంటనే దూరంగా పారిపోతున్నారు. ఈ రకమైన మెరుపు దాడులను సమరసేనుడు ముందుగా వూహించి వుండడు. ఆయన తన సైనికబలాలను నిలువరించి, తన అశ్వికులనుకూడా పదిపదిమంది చొప్పున చిన్నచిన్న ముఠాలుగా సమీకరించాడు.

(ఇంకా వుంది)



# ప్రత్యక్ష సాక్ష్యం

ఒకనాడు కొందరు ఒకచోట చేరి తమ మిత్రుడు మరొకడి మంచిచెడ్డలను గురించి ముచ్చటించుకుంటున్నారు. చాలామంది అతని మంచిగుణాలను గురించి పొగడినమీదట ఒక మిత్రుడు, "మనవాడు అన్నివిధాలా మంచి వాడే—సందేహంలేదు. వాడికి రెండే అవలక్షణాలున్నాయి!" అన్నాడు.

"ఏమిటవి?" అని అడిగారు మిగిలినవాళ్ళు.

"ఒకటి దురాగ్రహమూ, రెండు దుస్సాహసమూనూ!" అన్నాడు మిత్రుడు.

అప్పుడే అక్కడికి వస్తున్న ఆ వ్యక్తి తననుగురించి ఈ విమర్శ వింటూనే గబగబా వచ్చి విమర్శించినవాడి గొంతు పట్టుకుని, "చండాలుడా! నాకు దురాగ్రహమంటావా? గొంతు పిసికిపారేస్తాను! ఏమిటనుకున్నావో!" అని చంపబోయినంత పనిచేశాడు.

మిగిలిన స్నేహితులు అతన్ని విడిపించి. "నీకు దురాగ్రహమూ, దుస్సాహసమూ ఉన్నట్టు నువ్వే రుజువుచేసుకున్నావులే!" అని హేళనజేశారు.



# ఆత్మబలిదానం

పట్టు వదలని విక్రమార్కుడు శింశుపా వృక్షంవద్దకు తిరిగివెళ్ళి, చెట్టుమీదినుంచి శవాన్ని దించి, భుజంమీద వేసుకుని శ్మశానంకేసి బయలుదేరాడు. శవంలో గల బేతాళుడు, వికటాట్టహాసం చేసి, "రాజా, నిన్ను చూస్తే నాకు జీమూతవాహనుడి కథ జ్ఞప్తికి వస్తున్నది. కాలయాపనకోసం ఆ కథ విను," అంటూ ఈ కథ చెప్పాడు :

హిమాలయపర్వతాల నడుమ కాంచన నగరాన్ని జీమూతకేతువనే రాజు పరిపాలిస్తూండేవాడు. ఆ రాజు ఇంటిపెరట్లో కల్పవృక్షం ఉండేది. ఆ కల్పవృక్ష ప్రభావంచేత రాజవంశంవారు తమ కోరికలన్నీ నేరవేర్చుకుంటూండేవారు.

జీమూతకేతువుకు కుమారుడు జీమూతవాహనుడు. యుక్తవయసు రాగానే తండ్రి అతనికి యౌవరాజ్యపట్టాభిషేకం జరిపాడు. ఆ సమయంలో మంత్రులు జీమూతవాహ

బేతాళ కథలు

నుడితో, "యువరాజా, మీ వంశానికి కల్ప వృక్షం గొప్ప అండగా ఉంటున్నది. అది అనేకతరాలుగా మీ పూర్వీకులకు ఇష్ట కామ్యసిద్ధి కలిగించటమే గాక, ఎలాటి శత్రుభయమూ లేకుండా చేస్తున్నది. నీవు ఆ కల్పవృక్షాన్ని ప్రార్థించి నీ కోరికలన్నీ తీర్చుకోవచ్చు," అన్నారు.

ఈ మాట వినగానే జీమూతవాహనుడు ఆనందించటానికి బదులు, విచారంతో, "అయ్యో, నా పూర్వీకులు అన్ని కోరికలు తీర్చగల కల్పవృక్షాన్ని దగ్గిర ఉంచుకుని కూడా స్వార్థం చూసుకున్నారేగాని ఎన్నడూ పరోపకారం చేసినవారు కారే! ఈ జీవితంలో పరోపకారం తప్ప మిగిలినదంతా క్షణ భంగురమేకద? ఈ కల్పవృక్షం తమదని చెప్పుకున్నవారంతా ఇప్పుడెక్కడ వున్నారు? నేనుమాత్రం ఈ కల్పవృక్షాన్ని స్వార్థానికి వినియోగించను!" అనుకున్నాడు.

ఈ విధంగా ఆలోచనచేసినవాడై జీమూతవాహనుడు కల్పవృక్షంవద్దకు పోయి, "దేవా! ఎన్ని తరాలుగానో మా వంశానికి అడిగినదల్లా లేదనకుండా ఇచ్చావు. నాది ఒకటే ప్రార్థన: ప్రపంచంలో అభాగ్యజీవులూ, అనాథలూ ఎందరో ఉన్నారు. నీవు వెళ్ళి వారికి ఏ లోటూ



రాకుండా చెయ్యి! ఇంతకంటే నేను నిన్నేమీ కోరను," అని ప్రార్థించాడు.

వెంటనే కల్పవృక్షం అదృశ్యమై పోయింది. భూమిమీద వానలు చక్కగా కురిసి, పాడిపంటలు హెచ్చి, ప్రపంచంలో దరిద్రుడనేవాడు లేకుండాపోయాడు.

జీమూతకేతుడికీ, జీమూతవాహనుడికీ కల్పవృక్షం లేకుండాపోయిందని తెలియ గానే, వారి రాజ్యం కాజెయ్యాలనే దురాశతో దాయాదులు సైన్యాలు తరలించుకుని కాంచననగరం మీదికి దండెత్తి వచ్చారు. వారితో యుద్ధం సాగించటానికై జీమూతకేతుడు యత్నాలు ఆరంభించాడు.

కాని జీమూతవాహనుడు తండ్రితో, "నాయనా, ఎందుకీ యుద్ధం? ఈ రాజ్యం కోసం మనం మన దాయాదులనే చంపుకుందామా? కొంతకాలం వారినే రాజ్యం ఏలనీ! మనం మరెక్కడికైనా పోయి ఇహపరసుఖం వెతుక్కుందాం!" అన్నాడు.

"నీ యిష్టం, బాబూ! నీకే రాజ్యకాంక్ష లేకపోతే నాకెందుకు?" అన్నాడు తండ్రి.

జీమూతవాహనుడు రాజ్యాన్ని దాయాదులపరం చేసి, తన తల్లిదండ్రులతో బయలుదేరి దక్షిణసముద్రతీరాన మలయ పర్వతంమీద ఆశ్రమం ఏర్పరచుకున్నాడు. మలయపర్వతం మీద సిద్ధజాతివారుండే వారు. సిద్ధరాజు కొడుకైన మిత్రావసుడనే వాడితో జీమూతవాహనుడికి త్వరలోనే స్నేహం కలిసింది.

ఒకనాడు జీమూతవాహనుడు పర్వతం మీద షికారువెళ్లి గౌరీదేవళం చేరుకున్నాడు. దేవళంలో ఎవరో వీణవాయిస్తూ గౌరీస్తవాలు పాడటం వినిపించింది. అతను లోపలికి వెళ్ళేసరికి ఒక చక్కని యువతి కనిపించింది. ఆమె మిత్రావసువు చెల్లెలనీ, పేరు మలయవతి అనీ ఆమె చెలికత్తెవల్ల అతను తెలుసుకున్నాడు. అనంతరం ఆ చెలికత్తె మలయవతికి జీమూతవాహనుణ్ణి పరిచయం చేసింది.



వెంటనే మలయవతి అతన్ని ఎలా సత్కరించాలో తెలియక తన పళ్ళెంలో ఉన్న మాల తీసి జీమూతవాహనుడి మెడలో వేసింది. మరుక్షణం ఆ దండనే జీమూతవాహనుడు మలయవతి మెడలో వేశాడు. ఈ సంగతి విని మిత్రావసుడు తన చెల్లెలూ, తన మిత్రుడూ ఒకరినొకరు ప్రేమించుకున్నట్టు రూఢిచేసుకుని వారిరువురికీ వైభవంగా వివాహం చేసేశాడు.

కొంతకాలం గడిచింది. ఒకనాడు బావమరుదు లిద్దరూ చందనవృక్షాల మధ్యగా పర్వతం దిగి సముద్రతీరంవేపు బయలుదేరారు. ఒకచోట పెద్ద ఎముకలగుట్టలు ఉండటంచూసి జీమూతవాహనుడు మిత్రావసువును, అవి ఏమిటని అడిగాడు.

"గరుత్మంతుడికి నాగజాతిమీద పగ ఉన్న విషయం నీకు తెలుసుగదా. ఆ గరుత్మంతుడు తమ నాగకులంమీద పడి చంపుకుతింటూ భీభత్సం కలిగిస్తూండటం చూసి, నాగరాజైన వాసుకి గరుత్మంతుడితో ఒక ఒప్పందం చేసుకున్నాడు. ఆ ఒప్పందం ప్రకారం రోజుకొక నాగుణ్ణి ఆ కనబడే శిలవద్దకు పంపుతారు. గరుత్మంతుడు వచ్చి వాణ్ణి తిని వెళ్ళిపోతాడు. గరుత్మంతుడు తినివేసిన నాగుల అస్థికల గుట్టలే ఇవి," అన్నాడు మిత్రావసువు.






ఈ మాట వినగానే జీమూతవాహనుడి హృదయం కరుణతో ద్రవించిపోయింది. "అయ్యో, పాపం! ఈ నాగుల కెంత దుస్థితి వచ్చింది. వాసుకి వట్టి పందకాక పోతే రోజూ తన ప్రజలను తన శత్రువు పొట్టన పెడతాడా? ఇంత నీచమైన సంధికి ఒడబడ్డవాడు ముందుగా తానే గరుత్మంతుడికి ఆహారం కాలేకపోయాడా? గరుత్మంతుడి ఘనతమాత్రం ఏమిటి? రోజుకొక నాగుణ్ణి భక్షించి ఒక నాగకుటుంబాన్ని శోకసముద్రంలో ముంచేవాడు ఎటువంటి కిరాతకుడు?" అనుకున్నాడు జీమూతవాహనుడు మనసులో.

"మనం ఇల్లు విడిచి చాలాసేపయింది. తిరిగిపోదామా?" అన్నాడు మిత్రావసువు.

"నువు పద. నేను కొంచెం వెనకగా వస్తాను," అని జీమూతవాహనుడు, తన బావమరిదిని పంపేశాడు. అసలు సంగతేమంటే, ఆనాడు గరుత్మంతుడికి ఆహారం కానున్న నాగుడికి బదులు తానే ఆహారమై, కనీసం ఒక్క ప్రాణికైనా ప్రాణప్రదానం చేసి తరించుదామని అతను మనసులో నిశ్చయించుకున్నాడు.

కొద్దిసేపట్లోనే రోదనధ్వని వినిపించింది. ఒక ముసలిదీ, ఒక కుర్రవాడూ శిలకేసి రాసాగారు. "అయ్యో, నాయనా, శంఖచూడా! నీకప్పుడే నూరేళ్ళూ నిండాయా? నువు పోతే నాకు దిక్కెవరు, తండ్రీ? నా గతి ఏంకాను!" అని ముసలిది కడుపు పగిలేట్టు ఏడుస్తున్నది.

"ఏడిచి ఏం ప్రయోజనమమ్మా? ఇంక నాకు వేళయింది. నువు ఇంటికి పో! లేకపోతే నా చావు కళ్లారా చూడవలసి వస్తుంది!" అన్నాడు శంఖచూడుడు.

ఇంతలో జీమూతవాహనుడు ముందుకు వచ్చి, "అమ్మా, నీ కొడుకుకోసం దుఃఖించకు. ఈ రోజుకు నీ కొడుకు బదులు నేను గరుత్మంతుడికి ఆహారమవుతాను!

నీ కొడుకును తీసుకొని నిశ్చింతగా నువ్వు ఇంటికి వెళ్ళిపో!" అన్నాడు.

ముసలిది కన్నీటితోబాటు ఆనందాశ్రువులుకూడా రాలుస్తూ, "ఎంత చల్లనిమాట అన్నావు, తండ్రీ! కాని ఇంతమాట అన్నవాడివి నువుమాత్రం నా కొడుకువంటి వాడివికావా? నువు గరుత్మంతుడికి ఆహారం అయితేమాత్రం నాకు దుఃఖం కలగదా? వద్దు బాబూ, వద్దు!" అన్నది.

శంఖచూడుడు త్వరత్వరగా తల్లిని అక్కడినుండి పంపేసి, గరుత్మంతుడు వచ్చేలోగా గోకర్ణుడికి మొక్కుకు వద్దామని పరిగెత్తివెళ్ళాడు. శంఖచూడుడు తిరిగి వచ్చేలోగా ఎగురుతూ గరుత్మంతుడు వచ్చాడు. అది గమనించి జీమూతవాహనుడు శిలవద్ద నిలబడ్డాడు. గరుత్మంతుడు, అతనే నాగుడనుకుని అతన్ని పట్టి భక్షించసాగాడు. అయితే గరుత్మంతుడికి ఒకందుకు ఆశ్చర్యమయింది: ఈ నాగుడు ఇతర నాగుల్లాగా చావటానికి కొంచెమైనా భయపడటంలేదు. ఇతని ముఖాన శాంతం తప్ప మరేభావమూ లేదు. ఇది గరుత్మంతుడికి అర్థంకాలేదు.

ఇంతలోనే శంఖచూడుడు పరిగెత్తుకుంటూ వస్తూ, "గరుత్మంతుడా, అగు!




అగు! అతను నాగుడుకాడు! నాగుణ్ణి నేను! అతన్ని తినకు! నన్ను తిను!" అంటూ కేకలువేశాడు.

గరుత్మంతుడు నివ్వెరపోయి జీమూతవాహనుడికేసి చూసి, "నువు నాగుడివి కాకపోతే నాకెందుకు ఆహారమవుతున్నావు?" అని అడిగాడు.

"నువు పాషాణహృదయుడివి గనక రోజుకొక నాగుణ్ణి నిశ్చంతగా పొట్టనపెట్టుకుంటున్నావు. కాని ప్రాణం ఎంత అమూల్యమైనదో నాకు తెలుసు. అందుచేత ఒక నాగుడికైనా ప్రాణదానం చేద్దామని నేనీ పని చేశాను. ప్రాణదానంకంటె

ఉత్తమ ధర్మం ఏమున్నది?" అన్నాడు జీమూతవాహనుడు.

గరుత్మంతుడికి పశ్చాత్తాపం కలిగి, "మహాత్మా! తెలియక చేసిన అపరాధాన్ని క్షమించు," అన్నాడు.

"తెలిసి రోజూ అపచారం చేసేవాడికి క్షమాపణ ఏమిటి? రోజూ నువ్వు భక్షించే నాగులు నాలాటి ప్రాణులు కారా?" అన్నాడు జీమూతవాహనుడు.

"ఇక నాగుల జోలికెన్నడూ పోను. నన్నుమటుకు నువు క్షమించాలి!" అన్నాడు గరుత్మంతుడు. శంఖచూడుడి ప్రాణం దక్కింది. జీమూతవాహనుడు ఇంటికి తిరిగివెళ్ళాడు. అదిమొదలు గరుత్మంతుడు నాగకులాన్ని బాధించక స్వేచ్ఛగా వదిలివేశాడు.

ఈ కథ చెప్పి బేతాళుడు, "రాజా? ఆ యిద్దరిలో ఎవరు గొప్ప? శంఖచూడుడి బదులు తానే గరుత్మంతుడికి ఆహారం కావటానికి సిద్ధపడిన జీమూతవాహనుడా? జీమూతవాహనుణ్ణి చావకుండా కాపాడిన శంఖచూడుడా? తెలిసి చెప్పకపోయావో, నీ తల వెయ్యి చెక్కలవుతుంది?" అన్నాడు.

"జీమూతవాహనుడు జీవకారుణ్యం కలవాడు. ప్రాణదానంకోసం ఆత్మబలి చేసుకోవటం తన ధర్మంగా భావించిన వాడు. శంఖచూడుడికోసరం కాకపోతే మరొకరికోసం అతను నిశ్చింతగా చచ్చి పోతాడు. అది స్వచ్ఛంద మరణం. శంఖ చూడుడి మరణం స్వచ్ఛందమరణంకాదు. అతనికి చావు బలాత్కారంగా అసన్న మయినది. ఆరోజు చావు తప్పితే అతనికి బలవన్మరణం ఉండదు. అది తెలిసికూడా జీమూతవాహనుణ్ణి కాపాడటానికి యత్నించాడు గనక శంఖచూడుడే గొప్పవాడు!" అన్నాడు విక్రమార్కుడు.

రాజుకు మౌనభంగం కాగానే బేతాళుడు శవంతోసహా మాయమై చెట్టెక్కాడు.



# కల్పనా - వాస్తవం

ఒక చిత్రకారుడు ఒక బొమ్మ వేశాడు. అందులో ఉన్న దృశ్యం ఏమంటే: ఒక వేటగాడు ఒంటరిగా ఒక గొప్ప సింహాన్ని చంపేశాడు. ఈ బొమ్మను చూడటానికి జనం ఎగబడ్డారు. అంత పెద్ద సింహాన్ని ఒంటరిగా చంపిన వేటగాడి పరాక్రమాన్ని ప్రశంసించసాగారు.

ఇంతలో అక్కడికి ఒక సింహం వచ్చింది. దాన్ని చూడగానే అందరి నోళ్ళూ కట్టుబడ్డాయి. అదికూడా బొమ్మకేసి చూసి, జనంవంక తిరిగి, "మిత్రులారా, ఈ బొమ్మలో మీరు విజయం సాధించారనటాని కేమీ సందేహం లేదు. కాని ఇది చిత్రకారుడి కల్పన. మా సింహాలు బొమ్మలు వేయటం నేర్చుకుంటే ఆ బొమ్మలు ఇంతకన్న మరి కొంచెం వాస్తవికంగా వుండేవి!" అన్నది.

బొమ్మను చూసి ఆనందిస్తూవుండిన జనం ఈ మాటలు విని సిగ్గుపడి తలవంచుకు వెళ్లిపోయారు.



# జాతిద్వేషం!












# దేవుడి సలహా

ఒకదేశంలో ఒక పేదరైతుండేవాడు. వాడికి ఏడుగురు పిల్లలు. ఒక్కొక్కప్పుడు ఇంట్లో తినటానికి చిన్న రొట్టెముక్కగాని, తాగటానికి గంజిగాని ఉండేదికాదు. రైతుకు చూడబోతే శ్రమపడి పనిచెయ్యటానికి శక్తిగాని, దొంగతనాలు చెయ్యటానికి ధైర్యంగాని లేదు.

కర్తవ్యమేమిటా అని ఆలోచిస్తూ, రైతు ఒకనాడు రహదారిమీద నిలబడి వుండగా ఇగోరి అనే ఒక పరాక్రమవంతుడు గుర్రం మీద సవారిచేస్తూ అటుగా వచ్చాడు.

"దణ్ణం, బాబయ్యా! యెక్కడికి ప్రయాణం?" అని అడిగాడు రైతు.

"దేవుడి దగ్గిరికి," అన్నాడు ఇగోరి.

"దేనికి?" అని రైతు అడిగాడు.

"మనుషుల కర్తవ్యాలు తెలుసుకురావటానికి," అని ఇగోరి జవాబు చెప్పాడు.

"నీకు పుణ్యం వుంటుంది. నన్ను దేవుడు ఏం చెయ్యమంటాడో కాస్త కనుక్కురా, బాబూ!" అని రైతు బతిమాలాడు.

"అలాగేలే," అంటూ ఇగోరి సాగిపోయాడు. ఈ ఇగోరి గొప్ప మోసగాడు. ఇతనికి దేవుడితో మాట్లాడివచ్చే శక్తి ఉన్నదని నమ్మి అనేకమంది అమాయకులు ఇతని సహాయం కోరేవారు. వాళ్ళ సమస్యలు తెలుసుకుని, వాళ్ళవద్ద డబ్బు పుచ్చుకుని ఇగోరి వెళ్ళిపోయేవాడు. కొంతకాలానికి తిరిగివచ్చి, "దేవుడు నిన్ను ఈవిధంగా చెయ్యమన్నాడు!" అని అందరికీ తలా ఒక సలహా ఇచ్చేవాడు. వాళ్ళు చాలా సంతోషించేవాళ్ళు. జనాన్ని ఇలా మోసగించిన డబ్బుతో ఇగోరి జలతారు దుస్తులు ధరించి, బంగారు జీనుగల గుర్రంమీద ఎక్కి తిరుగుతూండేవాడు.

రైతు ఇగోరి రాకకోసం రహదారిపైన కాపువేసివుండి, అతను కనిపించగానే,

ఆర్. రామనరసయ్య



"నా విషయం దేవుడితో మాట్లాడావా? దేవుడేం సలహా ఇచ్చాడు?" అని అడిగాడు.

"నేను నీ విషయం దేవుణ్ణి అడగటం మరిచాను," అన్నాడు ఇగోరి.

మరుసటిరోజున ఇగోరి మళ్ళీ ఆ దారిన వెళ్ళేటప్పుడు రైతు అతనికోసం కనిపెట్టుకునివుండి, "ఈమారైనా మరిచిపోకుండా దేవుణ్ణి నా విషయం అడుగు!" అన్నాడు. ఇగోరి సరేలెమ్మన్నాడేగాని తిరిగివచ్చేటప్పుడు రైతు కనిపించగానే, "నీ మాటే మరిచాను," అని జవాబుచెప్పాడు. ఇలా అంటే రైతు తనకేమన్నా ముట్టజెప్పుతాడేమోనని ఇగోరి ఆశ.

మూడోసారి ఇగోరిని రైతు మళ్ళీ దారి కాచి పట్టుకున్నాడు.

"ఈసారైనా దేవుడికి నా బాధ కొంచెం చెబుదూ, నీకు పుణ్యంవుంటుంది! దారిద్ర్యంబాధ భరించలేక చచ్చిపోతున్నాను," అని రైతు ఇగోరిని బతిమాలాడు.

"అదెంత భాగ్యం! అడుగుతాలే!" అన్నాడు ఇగోరి.

"అలాకాదు. నువు మళ్ళీ మరిచిపోతావు. నీ బంగారు రికాబుల్లో ఒకటి నా దగ్గిర ఉంచి మరీ వెళ్ళు. అలాఅయితే గాని నీకు జ్ఞాపకం ఉండదు! ఈ రికాబు నావద్ద ఉంచావంటే నన్ను జన్మలో మరిచిపోవు!" అన్నాడు రైతు.

రికాబు ఇవ్వనంటే రైతు తన్నేస్తాడేమోనని ఇగోరికి భయం వేసింది. అతను పరాక్రమవంతుడుగా చలామణీ అవుతున్నాడేగాని నిజంగా పరాక్రమవంతుడు కాడు. అంతుచేత గత్యంతరం లేనివాడై ఇగోరి తన గుర్రం జీనునుంచి ఒక రికాబు ఊడదీసి రైతుకిచ్చి ముందుకు సాగిపోయాడు.

అతను తిరిగివచ్చేదాకా రైతు రహదారి మీద కాచుకుకూచుని, ఇగోరి రాగానే, "ఏమన్నాడు దేవుడు?" అని అడిగాడు.

"నువు నా రికాబు తీసుకుని ఉండక

పోతే మళ్లీ నీ విషయం మరిచేవాణ్ణేసుమా! అందరి విషయాలూ అడిగి తిరిగి గుఱ్ఱం ఎక్కబోతూ, రికాబు కనిపించకపోయేసరికి నీ మాట జ్ఞాపకం తెచ్చుకున్నాను. మళ్ళీ వెనక్కు వెళ్ళి నీ మాట అడిగానన్న మాట," అన్నాడు ఇగోరి నవ్వుతూ.

"ఆఁ, ఆఁ! ఏమంటాడు దేవుడు? నన్నెట్లా బతకమంటాడు?" అన్నాడు రైతు ఎంతో ఆత్రంగా.

"నువు ఎట్లాగూ బతకలేవన్నాడు దేవుడు. ఎవరి నెత్తినైనా చెయ్యిపెట్టి బతకమన్నాడు! అంతకంటె వేరే ఉపాయం లేదన్నాడు!" అని చెప్పాడు ఇగోరి.

"ఈ సహాయంచేసి చాలా పుణ్యం కట్టుకున్నారు. దణ్ణాలు, బాబయ్యా!" అంటూ రైతు వెళ్ళిపోవటానికి వెనక్కు తిరిగాడు.

"ఉండు! ఆగు! ఎక్కడికి పోతున్నావు? నా బంగారు రికాబు నాకిచ్చి వెళ్ళు!" అన్నాడు ఇగోరి అదుర్దాగా.

"ఏం రికాబు?" అన్నాడు రైతు వెనక్కు తిరిగిచూసి.

"నా దగ్గిరనుంచి తీసుకున్న రికాబు!" అన్నాడు ఇగోరి.

"నేను నీదగ్గిర రికాబెప్పుడు తీసుకున్నాను! ఇంతకుముందు నిన్ను చూడ




నైనాలేదే?" అన్నాడు రైతు దౌర్జన్యంగా. ఇగోరికి ఏంచెయ్యాలో తోచలేదు. రైతుతో ఎంత వాదించినా ఏమీ లాభం లేకపోయింది. పోట్లాడితే రైతు తంతాడేమో! "ఈ రికాబు నావద్ద ఉంచావంటే నన్ను జన్మలో మరిచిపోవు," అని రైతు అన్న మాటలు అక్షరాలా నిజమయాయి. చేసేదిలేక ఇగోరి తనదారిన తాను వెళ్లాడు.

రైతు బంగారు రికాబును కనిపించిన వారికల్లా అమ్మజూపనారంభించాడు. ఒక రోజు ఒక జమిందారు గుఱ్ఱపుబండీలో రహదారివెంట వస్తూ రైతును చూసి ఆ రికాబును బేరంచేశాడు.

"దీన్ని ఎంతకమ్ముతావు ?" అని అడిగాడు జమీందారు.

"పదిహేనువందల కాసులకిస్తాను," అన్నాడు రైతు.

"పదిహేను వందలు చేస్తుందిటోయ్, ఈ రికాబు ?" అన్నాడు జమీందారు.

"మేలిమి బంగారంతో చేసింది, బాబూ!" అన్నాడు రైతు.

జమీందారు తన సంచీలో వున్న సొమ్ము ఎంచిచూస్తే వెయ్యి కాసులే ఉన్నాయి.

"ఇదుగోనోయ్, ఈ వెయ్యి కాసులూ తీసుకుని రికాబిచ్చెయ్యి. మిగిలిన అయిదు వందలూ ఇంటికి వెళ్లి పంపిస్తా[illegible], నీ సొమ్మెక్కడికీ పోదులే!" అన్నాడు జమీందారు ఎంతో నమ్మకంగా.

"వెయ్యి కాసులూ ఇచ్చెయ్యండి, కాని పదిహేనువందలూ చేతికందితేగాని రికాబివ్వను," అన్నాడు రైతు.

జమీందారు వెయ్యి కాసులూ రైతుకిచ్చి ఇంటికి వెళ్ళాడు. వెంటనే మరొక అయిదువందల కాసులు తన నౌకరుచేతికిచ్చి, "ఇవి తీసుకుపోయి రైతుకిచ్చి, బంగారు రికాబిస్తాడు పట్టుకురా!" అన్నాడు.

నౌకరు రైతు వుండే గుడిసెదగ్గరకు వచ్చి, "మా దొరగారు, నీకు ఈ డబ్బియ్యమన్నారు," అని చెప్పాడు.



"సరే, మీ దొరగారు ఇయ్యమంటే ఇచ్చెయ్యి," అన్నాడు రైతు.

నౌకరు అయిదువందల కాసులూ రైతు చేత పెట్టి, "ఇక రికాబు ఇచ్చెయ్యి. నేను తొందరగా వెళ్ళాలి," అన్నాడు.

"రికాబేమిటి?" అన్నాడు రైతు.

"నీదగ్గిర మా దొరగారు కొన్న బంగారు రికాబు!" అన్నాడు నౌకరు.

"నాదగ్గిర బంగారు రికాబెక్కడిది?" అని అడిగాడు రైతు.

"లేకపోతే డబ్బెందుకు పుచ్చుకున్నావు? ఇచ్చెయ్యి!" అన్నాడు నౌకరు. "డబ్బా? ఏం డబ్బు?" అని అడిగాడు రైతు.

"నేను నీ కిప్పుడిస్తినే అయిదువందల కాసులూ?" అన్నాడు జమీందారు పంపిన నౌకరు నిర్ఘాంతపోయి.

"కాసులా? నేను అయిదు గవ్వలు కూడా నా కంటితో చూసిన పాపానపోలేదు," అన్నాడు రైతు.

నౌకరు తిరిగిపోయి, రైతు అన్న దగాఖోరు మాటలు జమీందారుకు తెలిపాడు. జమీందారు వెంటనే రైతు ఇంటికి బయలుదేరివచ్చి కోపంగా, "దొంగవెధవా? నా నౌకరుచేత పంపిన డబ్బుకూడా తీసుకుని బంగారు రికాబివ్వను పొమ్మన్నావుటగా?" అని [illegible]ంగా అడిగాడు.



"పేదవాణ్ణి, పెద్దవాణ్ణి. నాదగ్గిర బంగారు రికాబెందు కుంటుంది? తమరే సెలవియ్యండి!" అన్నాడు రైతు.

"అయితే నీ సంగతి యిప్పుడే తేలుస్తాను న్యాయస్థానానికి పోదాం పద," అన్నాడు జమీందారు కోపంగా.

"దానికేం భాగ్యం? కాని, నేనేమో తిండికిలేని రైతును. నా బట్టలు చూడండి. తమరు సామంతులు, నావెంట న్యాయస్థానాని కెట్లా బయలుదేరుతారో తమరే ఆలోచించండి. కాస్త మంచిబట్టలైనా ఉంటే తమవెంట వద్దును!" అన్నాడు రైతు.

"బట్టలకేంలే? నేనిప్పిస్తాను. బయలు దేరు," అన్నాడు జమీందారు.

జమీందారు కట్టబెట్టిన మంచిబట్టలు ధరించి రైతు జమీందారువెంట న్యాయస్థానానికి వెళ్ళాడు.

"వీడు నాకు బంగారు రికాబు అమ్ముతానని మాటయిచ్చి డబ్బంతా తీసేసుకుని, ఇప్పుడడిగితే రికాబు నాపరంచెయ్యకుండా తిప్పలు పెడుతున్నాడు," అని జమీందారు న్యాయస్థానంలో ఫిర్యాదు చేశాడు.

"ధర్మప్రభువులు చిత్తగించాలి. నేను పేదవాణ్ణి, పెద్దవాణ్ణి. పిల్లలకు ఇంత రొట్టెముక్కఅయినా లేని బీదసంసారం. నాదగ్గిర బంగారు రికాబు లెందుకుంటాయి? ఈ పెద్దమనిషి నన్నే మియ్యమంటారో నా కర్థంకాకుండా వుంది? ఇంకా స్సే పుంటే నేను వేసుకున్న బట్టలు కూడా తెమ్మంటారల్లే వుంది!" అన్నాడు రైతు.

"ఆ బట్టలు నావికావా?" అని అడిగాడు జమీందారు ఆశ్చర్యంగా.

"చూశారా? అలావుంది న్యాయం!" అన్నాడు రైతు న్యాయాధికారితో.

న్యాయాధికారి జమీందారు తెచ్చిన ఫిర్యాదు కొట్టేసి, ఇద్దరినీ పంపేశాడు. రైతు "దేవుడి సలహా" ప్రకారం అందర్నీ మోసగిస్తూ సుఖంగా బతకసాగాడు.



# పిల్లను పెట్టిన బూరెలమూకుడు

ఒకసారి గోహాకు పిండివంట చేయించుకు తినాలనిపించింది. కాని ఇంట్లో పెద్ద బూరెలమూకుడు లేదు. అందుచేత పొరుగింటికి పనిమనిషిని పంపి వాళ్ళ బూరెల మూకుడు అరువు తెప్పించాడు. దానితో పని ముగియగానే గోహా పొరుగింటివారి బూరెలమూకుడులో ఒక బొమ్మల బూరెలమూకుడు పెట్టి పంపించాడు. కొంతసేపటికి పొరుగింటివాడు వచ్చి, "గోహా, మా బూరెల మూకుడులో ఒక బుల్లి బూరెలమూకుడున్నది. ఏమిటి కారణం?" అని అడిగాడు. "మీ బూరెలమూకుడు పిల్లను పెట్టింది కాబోలు, నాకేమీ తెలియదు!" అన్నాడు గోహా. పక్కయింటివాడు తృప్తిపడి వెళ్ళిపోయాడు.

కొంతకాలం గడిచాక గోహా మళ్లీ పొరుగింటికి వెళ్ళి బూరెలమూకుడు అరువడిగాడు. పొరుగింటి ఆయన సంతోషంగా ఇచ్చాడు. కాని గోహా యెంత కాలానికీ దాన్ని తిరిగి ఇవ్వలేదు. కొంతకాలం చూసి పొరుగింటివాడు గోహా దగ్గిరికి వచ్చి, "మీదగ్గిర వుంటే పోతుందనికాదు, కాని బూరెలమూకుడుతో పనిపడింది, ఇప్పిస్తారా?" అని అడిగాడు.

"ఏ బూరెలమూకుడు?" అని అడిగాడు గోహా.

"ఆనాడు పిల్లను పెట్టిందే, ఆ మూకుడు!" అన్నాడు పొరుగింటివాడు.

గోహా నిట్టూర్చి, "తమ్ముడూ, పుట్టిన ప్రతిదీ చస్తుంది. అల్లానుంచి వచ్చిన ప్రతిదీ అల్లాను చేరవలిసిందే! ఆ బూరెలమూకుడు పాపం, అప్పుడే చచ్చిపోయింది!" అన్నాడు.






ఒకనాడు భోజరాజు తన గుర్రమెక్కి వేటకని బయలుదేరాడు. అడివికిపోయే మార్గానికి అడ్డంగా ఒక సెలయేరున్నది. ఆ సమయానికే ఏటిలో దిగివస్తూ, నెత్తిన కట్టెల మోపు పెట్టుకుని ఒక బ్రాహ్మడు కనిపించాడు. ఆ బ్రాహ్మడు అడవిలో కట్టెలు కొట్టుకుని తెచ్చుకుంటున్నాడు. రాజుకూ అతడికీ ఈవిధంగా సంభాషణ జరిగింది.

భోజుడు: కియన్మానం జలం, విప్ర? (బ్రాహ్మడా, నీరెంత లోతు?)

బ్రాహ్మడు: జానుదఘ్నం, నరాధిప. (రాజా, మోకాటి లోతు)

భోజుడు: ఈదృశీ కిమవస్థా తే? (నీకీ అవస్థ ఏమిటి?)

బ్రాహ్మడు: నహి సర్వే భవాదృశాః. (అందరూ నీలాటి వారౌతారా?)

బ్రాహ్మడు అనిన చివరి మాటకు ముచ్చటపడి భోజరాజు, "నువు వెంటనే కోశాధికారివద్దకు వెళ్ళి, నే నిమ్మన్నానని లక్షరూపాయలు తెచ్చుకో!" అని తన దారిన తాను వెళ్ళాడు.

ఈ మాటకు బ్రాహ్మడు ఎంతో సంతోషించి, ఆ కట్టెలమోపు అక్కడే పారేసి నేరుగా భోజరాజు ఆస్థానానికి వెళ్ళాడు. అక్కడ ఆయన కోశాధికారి దర్శనం చేసుకుని, "భోజరాజుగారు తమరి నడిగి లక్ష రూపాయలు తీసుకోమన్నారు," అని సవినయంగా చెప్పాడు.

బ్రాహ్మడి వాలకంచూసి కోశాధికారి నమ్మలేక, "రాజుగారి ఉత్తరువైతే తప్ప ఇవ్వటానికి వీలులేదు. వెళ్ళు," అన్నాడు.

భోజరాజు వేటనుంచి తిరిగివచ్చాక బ్రాహ్మడు మరొకసారి కోశాధికారి దర్శనం చేశాడు. "రాజుగారు నాతో నీ విషయం ఏమీ చెప్పలేదు. సొమ్మెలా ఇచ్చేది?" అన్నాడు కోశాధికారి.

జె. రామావధాని

"తమరు అడిగిచూశారా?" అని అడిగాడు బ్రాహ్మడు.

"ఇచ్చేవారు నాతో చెప్పరుటయ్యా? నేనెందు కడగాలీ? కావలిస్తే నువే వెళ్ళి అడుగు!" అని కసిరాడు కోశాధికారి.

బ్రాహ్మడు భోజరాజువద్దకు వెళ్ళి, "మహాప్రభూ! తమరు కోశాధికారి నడిగి లక్ష పుచ్చుకోమన్నారు. కోశాధికారి నడిగితే తమ ఉత్తరువు అయితేగాని సొమ్మివ్వటానికి వీలులేదన్నాడు. ఏమిటి నాగతి?" అని అడిగాడు.

భోజరాజు నొచ్చుకుని, "కోశాధికారి దగ్గిరికి మళ్లీ వెళ్ళి నేనిమ్మన్నానని రెండు లక్షలు పుచ్చుకో!" అన్నాడు. కాని కోశాధికారి బ్రాహ్మణ్ణి అవమానించి, డబ్బివ్వకుండానే పంపాడు.

బ్రాహ్మడికి చాలా కోపం వచ్చింది. అయన నేరుగా భోజరాజు దర్శనానికి వెళ్లి, అయనతో ఇలా అన్నాడు:

"రాజన్, కనకధారాభిః త్వయి సర్వత్ర వర్షతి,
అభాగ్యచ్ఛత్ర సంపన్నే మయి నాయాంతి
బిందవః।
త్వయి వర్షతి పర్జన్యే సర్వే పల్లవితాద్రుమాః,
అస్మాక మర్క వృక్షాణాం పూర్వ
పత్రేషు సంశయః॥"

(ఓరాజా! నువు అంతటా బంగారువాన కురిపిస్తున్నప్పటికీ, దురదృష్టమనే గొడుగు వేసుకున్న నాపైన ఒక్క చుక్క అయినా పడకుండా వున్నది. నువు కురిపించే వానకు అన్ని చెట్లూ చిగుర్చుతూంటే నావంటి జిల్లేడు చెట్టుకు పూర్వం వుండిన ఆకులు కూడా పోతాయా అనిపిస్తోంది!)

భోజరాజు డబ్బిస్తాడన్న ఆశతో, పాపం, బ్రాహ్మడు కట్టెలు కొట్టుకునే పనికూడా మానేశాడు. అతని దుస్థితి గ్రహించిన భోజరాజు, కోశాధికారికి కబురుచేసి బ్రాహ్మడికి మూడులక్షల రూపాయలూ, పది ఏనుగులూ ఇప్పించి, అతణ్ణి సంతోషపెట్టాడు.






# బుద్ధిలేని పెద్దమ్మ

ఒక ఊళ్ళో ఒక కాపువాడు ఉండేవాడు. అతను నిత్యమూ లక్ష్మిని ఆరాధించేవాడు. అందుచేత లక్ష్మి అతనికి అన్నివిధాలా కలిసి వచ్చేటట్టు చూస్తూండేది.

ఇలావుండగా ఒకనాడు లక్ష్మీదేవీ, ఆమె అప్పగారైన జ్యేష్ఠాదేవీ కలిసి ఈ కాపు వుండే ఊరివేపు వచ్చారు. దారిలో లక్ష్మి తన అప్పకు ఒక పొలం చూపించి, "ఈ పొలం చూశావా, అక్కా? ఎంత బాగా పెరిగివస్తున్నదో? ఈ పొలం ఒక కాపుది. అతను మట్టి పట్టుకుంటే బంగార మవుతుంది," అన్నది.

జ్యేష్ఠాదేవి కళ్ళు చికిలించి పొలంకేసి పరీక్షగా చూసి, "మరొక వారంలోగా పెద్దవాన కురిపించి ఈ పంట యావత్తూ నాశనం చేస్తాను." అన్నది.

ఆరాత్రి లక్ష్మీదేవి కాపు ఇంటికి పోయి అతనితో, "అబ్బీ, నువు బాగుపడదలిస్తే రేపు ఉదయమే ఈ ఏటి పంటంతా జట్టీకి ఇచ్చెయ్యి," అన్నది. కాపు అప్రకారమే పంట యావత్తూ ముందుగానే ఆవూరు షావుకారుకు అమ్మేసి, అతని వద్దనుంచి సగం సొమ్ము బయానా పుచ్చుకున్నాడు.

వారం తిరక్కముసుపే అట్టహాసంగా వానకురిసింది. అన్ని చేలూ అంత ఇంతో దెబ్బతిన్నాయిగాని కాపు పొలంలో పంట బొత్తిగా నేలమట్టమై పోయింది.

మళ్లీ అప్పాచెల్లెళ్ళు అటుగా వచ్చారు. "చూశావా, కాపు గతి ఏమయిందో?" అన్నది పెద్దమ్మ.

"కాపు నష్టపడలేదనుకుంటాను. ఎందుకంటే అతను ఈ పంటను ఒక షావుకారుకు జట్టీకిచ్చాడు," అన్నది లక్ష్మి.

"అలాగా? పాపం, షావుకారు నిష్కారణంగా నష్టపడిపోతాడే! అయినా చేను దెబ్బతినకుండా, పూర్తిపంట పండేట్టుగా

ఎస్. ఇందిరాదేవి



చేస్తాను. అప్పుడు రైతు రోగం కుదురుతుంది!" అన్నది పెద్దమ్మ.

లక్ష్మి మళ్ళీ కాపువద్దకు వెళ్ళి, "అబ్బీ, షావుకారు దగ్గిరనుంచి పంటను మళ్ళీ తిరిగి కొనేసుకో," అని చెప్పింది.

కాపు అప్రకారమే షావుకారు వద్దకు వెళ్లి, "బాబూ, తమరు చాలా నష్టపడ్డారు. చెడ్డ సొమ్ము చెరిసగం. పంట నాకు వదిలెయ్యండి; మీరివ్వదేలిన బాకీ నేను వదులుకుంటాను," అన్నాడు.

షావుకారు పంట వదులు కున్నట్టు పత్రం రాసి కాపుచేతి కిచ్చేశాడు.

కాపు పొలంలో పడిపోయిన మొక్కలన్నీ మళ్ళీ లేచినిలబడ్డాయి. మామూలు కన్న ఎరగకాసింది చేను.

అక్కచెల్లెళ్ళు అటుగా వచ్చారు. "చూశావా? షావుకారుకు నష్టం కలగకుండా చేను కాపాడాను!" అన్నది పెద్దమ్మ.

"ఆ పంట యావత్తూ కాపు, షావుకారు దగ్గిర అప్పుడే కొన్నాడుగా? నష్టంమాత్రమే షావుకారిది!" అన్నది లక్ష్మి.

పెద్దమ్మ పళ్ళు పటపటా కొరికి, "దుర్మార్గుడు! నేను చేసిన యుక్తికల్లా ప్రతియుక్తి చేస్తాడుగా? కుప్పకి రెండు బస్తాలకన్న గింజరాలితే చూడు!" అన్నది.




లక్ష్మి మూడోసారి కాపువద్దకు పోయి, "అబ్బీ, నువ్వు పంటకోసి కుప్పలు వేసేటప్పుడు సాధ్యమయినన్ని ఎక్కువ కుప్పలు వేసి, వాటిని వేరు వేరు కళ్లాలలో నూర్చు. ఈ సంగతి బాగా గుర్తుంచుకో, లేకపోతే చాలా నష్టపడిపోతావు," అన్నది.

కాపు ఆ విధంగానే తన పంటను చిన్న చిన్న కుప్పలుగా వేసి, వేరు వేరు కళ్ళాలలో నూర్చాడు. ప్రతి కుప్పకు రెండేసి బస్తాల గింజలు రాలి మామూలుకన్న మూడింతలు ధాన్యం ఇల్లు చేరింది. ఆ ధాన్యం నిలవచేయటానికి కాపు కొత్తగా కొట్లు కట్టవలిసి వచ్చింది.

మరి కొద్దిరోజులకు అప్పచెల్లెళ్ళు కాపు ఇంటిమీదిగా పోయేటప్పుడు పెద్దమ్మ ఆగి, "ఈ కొట్లన్నీ ఏమిటి?" అన్నది.

"నువు చేసిన పనే! కుప్పకు రెండు బస్తాలు రాలాలంటివిగా? మూడువందల కుప్పలు వేసి నూర్చాడు. ధాన్యం దాచటానికి చోటు చాలక కొట్లు కట్టించుకున్నాడు," అన్నది లక్ష్మి.

ఇదంతా తన చెల్లెలే చేస్తున్నట్టు ఇప్పటికి పెద్దమ్మ తెలుసుకున్నది. "ఈసారి ఈ కాపు నేంచేస్తానో చూసుకో. రేపీపాటికి సర్వనాశనం కాకపోతే అప్పుడడుగు!" అన్నది పెద్దమ్మ.

"ఏం ఏంచేస్తా వేమిటి?" అని అడిగింది లక్ష్మి నవ్వుతూ.

"ఇంకా నీకు చెప్పకేం?" అన్నది పెద్దమ్మ కోపంగా.

ఆ రాత్రి లక్ష్మి కాపును చూడబోయి ఒక ఉపాయం చెప్పింది. మర్నాడు అప్పచెల్లెళ్ళు అతని ఇంటి చాయలకు వెళ్లేసరికి కాపు ఇంటి బయట మేళతాళాలు మోగుతున్నాయి.

ఇద్దరూ మానవరూపాలు ధరించి లోపలికి వెళ్ళారు. కాపు ఏవో పూజచేయబోయే ప్రయత్నంలో ఉన్నాడు.

"ఏం పూజచేస్తున్నావు, నాయనా?" అని లక్ష్మి కాపునడిగింది.

"జ్యేష్ఠాదేవికి పూజచెయ్యబోతున్నాను. ఆవిడ దయవల్ల నాకు ఈ యేడు ఎంతో కలిసివచ్చింది," అన్నాడు కాపు.

ఇద్దరూ బయటికి వచ్చాక లక్ష్మి తన అప్పతో, "నేనేమో చేశాననుకుంటివే, అక్కా? అంతా నీ చలవేనని అతనికి ముందే తెలుసు!" అన్నది.

"అలాగుటే? అయితే చాలా యోగ్యుడన్నమాటే! నేనింకా ఏమిటో అనుకున్నా!" అన్నది అమాయకపు పెద్దమ్మ. ఈ విధంగా రైతుకు అపాయం తప్పింది.



# కపటవైద్యం

ఒక రాజు కొక కుమార్తె కలిగింది. ఆయనకు ఆడపిల్లలంటే అంత ఇష్టంలేదు. ఈ పిల్ల ఎప్పుడు పెరిగి పెద్దదై, పెళ్ళిచేసుకుని అత్తవారింటికి వెళ్ళిపోతుందా అని ఆయనకు విచారం పట్టుకున్నది. ఎవరైనా ఏదైనా మూలికాప్రయోగం చేసి, పిల్ల వెంటనే పెద్దవయేలాగు చేస్తారేమో! అలా పిల్లను మందులతో పెద్ద దాన్ని చేసినవారికి లక్షరూపాయలిస్తానని రాజు చాటింపువేశాడు.

రాజు వేయించిన చాటింపు విని వైద్యులంతా పొట్ట చెక్కలయేటట్టు నవ్వుకున్నారు. ఒక్క వైద్యుడు మటుకు రాజువద్దకు వెళ్లి, "మహారాజా, తమ కుమార్తె పెద్దదికావటానికి తగిన చికిత్స నేను చేయగలను. నాకు లక్ష రూపాయ లిప్పించండి!" అన్నాడు.

"చికిత్స ఎంతకాలం పడుతుంది?" అన్నాడు రాజు.

"మూలిక వెయ్యి ఆమడనుంచి తెప్పించాలి. అది రాగానే ఔషధం తయారై పోతుంది," అన్నాడు వైద్యుడు. రాజు చికిత్సకు ఒప్పుకున్నాడు.

కొన్ని సంవత్సరాలు గడిచాయి. రాజు, వైద్యుణ్ణి పిలిచి, "చికిత్స ముగిసిందా?" అని అడిగాడు.

"వెళ్లినవారింకా తిరిగిరాలేదు, మహారాజా!" అన్నాడు వైద్యుడు.

ఇలావుండగా రాజకుమార్తె పెరిగి పెద్దదయింది. వైద్యుడు రాజువద్దకు వెళ్లి, "చికిత్స పూర్తిఅయింది. ఇక అమ్మాయిగారికి వివాహం ఏర్పాటు చేయించవచ్చు!" అన్నాడు. రాజు వైద్యుడికి మరొక లక్ష బహుమానం చేశాడు.






# నిజం చెప్పిన నీచుడు

ఒక ఊళ్ళో ఒక బ్రాహ్మ డుండేవాడు. ఆయనకు వేదశాస్త్రాలు రావుగాని పూజలూ పునస్కారాలూ చేయించటానికి పనికివచ్చే మంత్రాలు మాత్రం వచ్చు. అయినా ఆ బ్రాహ్మడు చాలా నీచుడు కా[illegible]ంచేత ఎవరూ అతన్ని పూజలకుకూడా పిలిచే వారుకారు. చివర కాయనకు పొట్టగడిచే దారి లేక ఊళ్ళమీద బయలుదేరాడు.

ఒక ఊరి చివర ఆ బ్రాహ్మడి కొక శివాలయం కనిపించింది. ఆ ఆలయంలో పూజా పునస్కారాలు జరగటంలేదు. బ్రాహ్మడు ఆ ఆలయం ఆక్రమించుకుని దానికి అర్చకుడైనాడు. తరవాత ఆయన ఊళ్ళో పెద్దవారందరి దగ్గిరికీ వెళ్ళి, తనకు ఈశ్వరుడు కలలో ప్రత్యక్షమైనాడనీ, అర్చన జరపమని కోరాడనీ, అందుకే తాను ఆరామడనుంచి వచ్చాననీ ఎన్నో అబద్ధాలు చెప్పాడు. వారందరూ నమ్మారు.

శివాలయంలో పూజా పునస్కారాలు జరుగుతున్నాయని తెలిసిన ఊళ్ళోవాళ్ళు కొందరు ఆలయానికి వచ్చి ఈశ్వరుడికి నైవేద్యాలు సమర్పించసాగారు. కాని అర్చకుడు అనుకున్నంతగా డబ్బు దొరకలేదు. ఈశ్వరుడి మహత్తు ప్రదర్శించటానికి అర్చకుడు చాలా కుయుక్తులు పన్నాడు. కాని, ఎంత శ్రమపడినా అర్చకుడికి తిండిఖర్చూ, పైఖర్చూ గడిచి దమ్మిడీ మిగలలేదు.

ఆఖరుకు ప్రాణంవిసిగి అర్చకుడు ఒక రోజు రాత్రి శివలింగాన్ని ఒక్క తన్ను తన్ని ఆరోజు తనవంతు వచ్చిన ప్రసాదంలో తాను తినగా మిగిలినది మూట కట్టుకుని, గుడిని వదిలేసి మళ్ళీ ఊళ్ళమీద బయలుదేరాడు.

తెల్లవారేసమయానికి అర్చకుడికి ఒక వృద్ధుడు తటస్థపడ్డాడు. ఇద్దరికీ గమ్యస్థానం లేదు. అందుచేత ముసలివాడు,

టి. నారాయణమూర్తి



"బాబూ, నన్నుకూడా కలుపుకో. పెద్ద వాణ్ణి, దిక్కులేనివాణ్ణి. ఒంటరిగా ప్రయాణంచేయలేను," అని బ్రతిమాలాడు. అర్చకుడు సరేనని ఒప్పుకున్నాడు.

మధ్యాన్నమయింది. ఇద్దరు ప్రయాణీకులూ ఒక నీడపట్టున భోజనానికి కూచున్నారు. "నాదగ్గిర కాసిని అటుకులున్నాయి. అవి తిన్నాక, ఇంకా కడుపు నిండకపోతే నీదగ్గిర ఉన్నది తిందాం," అన్నాడు ముసలివాడు. దీనికి అర్చకుడు అభ్యంతరం చెప్పలేదు.

కాని తీరా తినటం మొదలుపెడితే ముసలివాడి అటుకులే ఇద్దరూ కలిసి తినలేకపోయారు. ముసలివాడు భుక్తాయాసంతో చెట్టునీడను నడుమువాల్చి నిద్రకుపడ్డాడు. అదే సమయమనుకుని అర్చకుడు ముసలివాడి పైబట్ట కొంగున మూటలో మిగిలివున్న అటుకులు తీసుకుని తినేశాడు.

ముసలివాడు కొంతసేపటికి లేచి అటుకులకోసం వెతుక్కుని, అవి కనబడకపోయేసరికి, "నా అటుకు లేమయాయి? నువేమైనా తీసుకు తిన్నావా ఏమిటి?" అని అర్చకుణ్ణి అడిగాడు.

"లేదే? నేను వాటిని చూడనైనాలేదు," అన్నాడు అర్చకుడు.

"అలాగా, అయితే పోనీలే," అన్నాడు ముసలివాడు.

వాళ్ళు అక్కడినుంచి బయలుదేరి ఒక దేశం వెళ్ళారు. ఆ దేశపు రాజకుమార్తె చావుబతుకుల్లో ఉన్నది. ఆమె వ్యాధి నయంచేసినవారికి రాజు అంతులేని ధనమిస్తానని ప్రకటించాడు.

ఈ సంగతి తెలిసి ముసలివాడు అర్చకుడితో, "ఈ రాజకుమార్తె వ్యాధి మనం సులువుగా నయంచేయవచ్చును. పాపం, ఆమె ప్రాణం కాపాడదాం," అన్నాడు.

"మనకు రాజు బోలెడంత బంగారం ఇస్తాడు," అన్నాడు అర్చకుడు ఆశగా.

ఇద్దరూ కలిసి రాజభవనానికి వెళ్లారు. రాజకుమార్తె కొనప్రాణంతో వున్నది.

"మహారాజా, మీకిక మరొక ఆశలేని పక్షంలో మీ కుమార్తెను మాకు వప్పగించండి. మే మామెకు చికిత్స చేస్తాం. చికిత్సవివరాలు మీరు చూడటానికి వీల్లేదు" అన్నాడు ముసలివాడు రాజుతో.

తన కుమార్తె బతికే ఆశలేక రాజు ఆమెను ముసలివాడికి వప్పగించటానికి ఒప్పుకున్నాడు. చికిత్సకు వేరేయిల్లు ప్రత్యేకించారు. ముసలివాడు అందులో పెద్ద గుండంలో హోమంతయారుచేయించాడు. పెద్ద గంగాళంతో పాలు తెప్పించాడు. తరవాత అర్చకుణ్ణితప్ప మిగిలిన అందర్నీ పంపేసి, తలుపులు గడియలుపెట్టాడు.

ముసలివాడు ఏం చికిత్స చేస్తాడోనని అర్చకుడు శ్రద్ధగా పరికిస్తున్నాడు. ముసలివాడు రాజకుమార్తెను ఎత్తి హోమగుండంలో పడేశాడు. కొద్దిసేపట్లో ఆమె భస్మమై పోయింది.

"భేష్! ఇప్పుడామెను బతికిస్తాం!" అంటూ ముసలివాడు రాజకుమార్తె అస్తికలు బయటికితీసి వాటిని పాలగంగాళంలో వేశాడు. వెంటనే రాజకుమార్తె పూర్ణాయురారోగ్యాలతో నవనవలాడుతో గంగాళంలో లేచి నిలబడింది.



రాజు పరమానందభరితుడై ముసలి వాడికీ, అర్చకుడికీ సమస్త సత్కారాలూ చేసి, భోజనం పెట్టి, అంతులేని బంగారు కాసులు తెచ్చి వారి ఎదట పోసి, "అశ్వినీ దేవతల్లాగా మీరు సమయానికి వచ్చి నా కుమార్తెను బతికించారు. ఏమిచ్చినా మీ రుణం తీరదు. ఈ బంగారంనుంచి మీరు మోయగలిగినంత తీసుకుని నన్ను కృతార్థుణ్ణి చెయ్యండి," అని ప్రార్థించాడు.

"ముసలివాణ్ణి! మొయ్యలేను," అంటూ ముసలివాడు రెండు వేళ్ళతో పట్టగలిగినన్ని కాసులు మాత్రమే తీశాడు. అర్చకుడు మాత్రం ఆత్రంగా తన పైబట్ట కొంగున తాను ప్రయాసతో మోయగలిగినంత బంగారం మూటగట్టుకున్నాడు.

ఇదిచూసి రాజభవనంలో నౌకర్లు, అర్చకుడే అసలువైద్యుడై ఉంటాడనుకున్నారు. వారిలో ఒకడు అర్చకుడిదగ్గిరికి వచ్చి రహస్యంగా, "ఇక్కడికి అయిదామడల దూరాన మరొక రాజుగారున్నారు. ఆయన కుమార్తెకూడా దీర్ఘవ్యాధితో బాధపడుతున్నది. అయితే ఆమె ప్రాణాపాయ స్థితిలోలేదు. మా రాజకుమార్తె వ్యాధి కుదిర్చిన మీకు ఆమె వ్యాధి కుదర్చటం ఏమంత కష్టంకాదు. మీరు వెళ్ళి ఆమెను చూడటం మంచిది," అని చెప్పాడు.





ఒకసారి చికిత్స చూసి ఉన్నాడుగనక అదే పద్ధతిలో రెండో చికిత్సకూడా చేసి మరింత బంగారం సంపాదించాలని అర్చకుడికి దుర్బుద్ధి పుట్టింది. అందులో ముసలివాడు వంతు తీసుకుపోతాడేమోనని ఈ విషయం ఆయనకు చెప్పక అర్చకుడు ఆ రాజ్యానికి ప్రయాణంకట్టాడు.

రెండో రాజ్యంలో రాజకుమార్తె దీర్ఘవ్యాధితో తీసుకుంటున్న మాట నిజమే. అయితే అడ్డమైనవాళ్లూ వచ్చి ధనాశతో వైద్యానికి పూనుకుని ఉండటంవల్ల, వ్యాధి నయంచెయ్యలేని వైద్యులను ఉరితీస్తానని రాజు నియమం పెట్టిఉన్నాడు.

కాని అర్చకుడు ఈ నియమానికి బెదరలేదు; ఎందుకంటే తాను చేయబోయే చికిత్సమీద ఆయనకు పూర్తి విశ్వాసం ఉన్నది. అందుచేత ఆయన ముసలివాణ్ణి సత్రంలో ఉంచి తాను రాజాంతఃపురానికి వెళ్లాడు. రాజకుమార్తెకు చికిత్స చేస్తానన్నాడు. మరణశిక్ష నియమానికి ఒప్పుకున్నాడు. అంతకు పూర్వమే తానొక రాజకుమార్తెను, ప్రాణం పూర్తిగా పోయిన దాన్ని బతికించానన్నాడు. తనకు రాజుగారు బహుమతి ఇచ్చిన బంగారం చూపి ఈ రాజుగార్ని నమ్మించాడు. వేరే ఒక ఇల్లు తీసుకుని హోమగుండం తయారు చేయించాడు. గంగాళంతో పాలు సిద్ధంగా ఉంచాడు. నిండు ప్రాణంతో ఉన్న రాజకుమార్తెను హోమగుండంలో వేసి బూడిద చేశాడు. ఆమె అస్తికలు ఎత్తి పాలలో వేశాడు. అస్తికలు పాలమీద తేలాయి. ఇంకేమీ జరగలేదు. రాజకుమార్తె ప్రాణంతో లేచిరాలేదు.

అర్చకుడికి కాళ్ళూ చేతులూ ఆడలేదు. హోమంనుంచి మరికొన్ని అస్తికలు తీసి పాలలో వేశాడు. అవికూడా పాలమీద తేలాయి. అర్చకుడికి ముచ్చెమటలు పట్టుకున్నాయి. చికిత్సలో జరిగిన లోపమేమిటో

అయనకు తెలియలేదు. ముసలివాడు చేసిన చికిత్సే తానూ చేశాడు. ఫలితం మటుకు లేదు.

రాజభటులు వచ్చి అర్చకుణ్ణి పట్టుకున్నారు. రాజుగారి ఆగ్రహానికి అంతు లేదు. రాజకుమార్తె నిండుప్రాణం తీసిన అర్చకుణ్ణి తక్షణం ఉరితీయవలసిందిగా రాజు ఉత్తరువుచేశాడు.

అర్చకుడు రాజు కాళ్ళ మీద పడి, "సత్రంలో నా శిష్యుడొక ముసలివాడున్నాడు. నన్ను ఒక ఘడియపాటు వదిలిపెట్టండి. ఆయనతో మాట్లాడి వస్తాను. మీ కుమార్తె బతుకుతుందని నాకింకా ఆశ ఉన్నది," అన్నాడు.

"నిన్నొక్క క్షణంకూడా వదిలేదిలేదు. వదిలితే పారిపోదామని చూస్తున్నావా? ఈ దుర్మార్గుణ్ణి వెంటనే వధ్యస్థానానికి తీసుకుపొండి!" అన్నాడు రాజు తన భటులతో.

అర్చకుడు ఉరికంబం చేరేసరికి ముసలివాడు అక్కడ హాజరయాడు.

"చచ్చిపోబోతున్నావు. ఇప్పుడన్నా చెప్పు, నా అటుకు లెవరు కాజేశారు?" అని అడిగాడు ముసలివాడు.

"నే నెరగను," అన్నాడు అర్చకుడు. అతన్ని భటులు ఒక మెట్టు ఎక్కించారు.



"నా అటుకు లెవరు కాజేశారో ఇప్పుడన్నా చెప్పు," అన్నాడు ముసలివాడు.

"ప్రమాణపూర్తిగా నే నెరగను," అన్నాడు అర్చకుడు. భటులు మరొక మెట్టు ఎక్కించాక ముసలివాడు మూడోసారి అదే ప్రశ్న వేశాడు. అర్చకుడు అదే సమాధానం చెప్పాడు. రాజభటులు అర్చకుణ్ణి మూడోమెట్టు ఎక్కించి ఉరితాడు అతడి మెడకు వేశారు. ఇంతలో రాజుకూడా అక్కడికి సపరివారంగా వచ్చాడు.

"కొంచెం ఆగండి. ఇతన్ని యెందుకు ఉరితీస్తున్నారు?" అని ముసలివాడు రాజును అడిగాడు.

"ఈ ద్రోహి నా కుమార్తె వ్యాధి నయం చెయ్యలేకపోగా ఆమె ప్రాణాలు తనపొట్టన పెట్టుకున్నాడు," అన్నాడు రాజు.

"ఆమెను నేను బతికిస్తాను, ఉరి నిలుపుచేయండి," అన్నాడు ముసలివాడు.

"ఇదొక ఎత్తా?" అన్నాడు రాజు.

"నావెంట మీ భటులను పంపండి. మీ కుమార్తెను బతికించలేకపోతే నన్ను కూడా ఉరితీయించవచ్చు," అన్నాడు ముసలివాడు రాజుతో.

అన్నప్రకారమే ముసలివాడు రాజ కుమార్తె అస్తికలు కొన్ని తీసుకుని పాలలో వేసి, ఆమెను బతికించాడు. ఆమెను పీడించిన దీర్ఘవ్యాధికూడా పోయింది.

రాజు పరమానందభరితుడై అర్చకుడి శిక్ష రద్దుచేసి, తన కుమార్తెకు ప్రాణభిక్ష పెట్టిన ముసలివాడికోసం ఒక కొయ్యపెట్టె నిండా బంగారుకాసులు పోసి సేవకులచేత సత్రానికి పంపాడు.

"మన మిద్దరమూ ఇంతకాలంగా కష్ట సుఖాలు పంచుకున్నాం. అందుచేత నాకు ఈ బంగారంలో కూడా వంతు ఇప్పించాలి," అని అర్చకుడు ముసలివాణ్ణి అడిగాడు.

ముసలివాడు సరేనని బంగారు కాసులు ఎంచి మూడు కుప్పలుగా పేర్చసాగాడు.

"మనం ఇద్దరమేకదా? మూడు వాటాలు దేనికి?" అని అడిగాడు అర్చకుడు.

"మూడో వాటా, నా అటుకులు దొంగ తనంగా తిన్నవాడిది!" అని జవాబు చెప్పాడు ముసలివాడు.

"అవి నేనేకదా తిన్నాను? ఆ వాటా కూడా నాదే!" అన్నాడు అర్చకుడు పరమానందంతో.

ముసలివాడు తలయెత్తి అర్చకుణ్ణి కోపంగాచూసి, "ఓరీ, పరమ నీచుడా! నువు నాకు అర్చకుడివిగా వుండి నన్ను కూడా అపవిత్రుణ్ణి చేశావుగదరా!" అంటూ అదృశ్యుడై పోయాడు.



# పురాతన జంతువులు

"భయంకరమైన బల్లుల" లో నేలమీద నివసించిన వాటిని "డినజార్" లంటారు. క్రిందటి నెల మూడురకాల "డినజార్" లను గురించి తెలుసుకున్నాం.

"డినజార్" లలో కెల్లా పెద్దది "డిప్లోడకస్." ఇది "బ్రాంటజారస్" కన్నా నేగాక, ప్రపంచంలో అంతకు పూర్వంగాని తరవాతగాని పుట్టిన అన్ని భూచరాలకన్న పెద్దది. "డిప్లోడకస్" ముక్కు చివరనుంచి తోకచివరకు 90 అడుగులుండేది. ఇది ఈనాడు బతికి వుంటే మేడల మూడో అంతస్తుకు సులువుగా తొంగిచూడగలదు.

భయంకరమైన బల్లులలో విపరీతమైన శరీరాలు గలవి ఇంకా అనేకం ఉన్నాయి. "బ్రాఖియోజారస్" అనేది 50 టన్నుల బరువుండేది. ఈ బల్లులన్నీ గుడ్లనుంచి వచ్చినవే. వాటి గుడ్లు ఎంత పెద్దవో ఊహించటానికి మనకు ఒకే ఆధారం ఉంది. 9 అడుగుల నిడివి గల ఒక డినజార్ 9 అంగుళాల గుడ్డు పెట్టేది. ఈ లెక్క ప్రకారం డిప్లోడకస్ 7 న్నర అడుగుల గుడ్డు పెట్టివుండాలి!

భయంకరమైన బల్లులలో కొన్ని నీటిని ఆశ్రయించాయి. "ప్లిసియోజార్" ఇలాటిది. దీనికి కాళ్లు లేవు, వాటికిబదులు ఈదే దొప్పలుండేవి. వీటి నిడివి 50 అడుగులదాకా ఉండేది. దీని నోట్లో వాడిఅయిన దంతాలుండేవి. నీటిలో నివసించే భయంకరమైన బల్లులు గాలి పీల్చటానికి నీటిపైకి వస్తూండవలసి వచ్చేది. వీటికి పెద్ద పెద్ద కన్నులుండేవి. వీటికి భూమిమీద గుడ్లుపెట్టే శక్తిలేదు. వీటి గుడ్లు నీటిలో పొదగవు. అందుచేత ఈ "చేప బల్లులు" తమ గుడ్లను తమ శరీరాలలోనే పొదగనేర్చాయి. "ఇక్థియోజార్", "మోస జార్" అనేవికూడా "చేపబల్లులు".

ఇలాగే పక్షిబల్లులుకూడా కొన్ని తయారయాయి. "టెరజార్" ఇలాటిది. గబ్బిలాల లాగా దీనికి తోలుపొర రెక్కలుండేవి. రెక్కలు విప్పినప్పుడు వాటిమధ్య 30 అడుగుల నిడివి ఉండేది. "ఆర్కియో టెరిక్స్", "టెరానడాన్" మొదలైనవి "పక్షిబల్లులు".

ఈవిధంగా భూమినీ, జలాన్నీ, గాలినీ ఆశ్రయించిన "భయంకరమైన బల్లులు" 15 కోట్ల ఏళ్ళపాటు భూమిపై అవిచ్ఛిన్నంగా ఏలి ఆకస్మికంగా అంతరించిపోయాయి. అంతటితో "సరీసృపాల యుగం" ముగిసింది.



# దూర గ్రహాలు

మన పూర్వీకులు వారాలకు పేర్లు పెట్టినపుడు సూర్యుడు, చంద్రుడు, కుజుడు, బుధుడు, గురుడు, శుక్రుడు, శని—ఈ పేర్లతో రోజులు ఏర్పాటుచేశారు. సూర్యుడి చుట్టూ తిరిగే గ్రహాలింకా ఉన్నాయని వారికి తెలియకపోవటానికి కారణం అవి చాలా దూరాన ఉండటమే.

* వీటిలో యురేనస్ అనే గ్రహం 1781లో కనిపెట్టబడింది. ఇది సూర్యుడికి సుమారు 178 కోట్ల మైళ్ళ దూరాన వున్నది. దీనిమీద పడే సూర్యకాంతి, భూమిపై పడేదానితో పోలిస్తే వెయ్యిలో 3 వంతులు మాత్రమే. ఈ గ్రహం గంటకు 260 మైళ్లచొప్పున సూర్యుణ్ణి చుట్టివస్తూ 84 ఏళ్ళకొక ప్రదక్షిణంచేస్తుంది. ఈ గ్రహం నిడివి దాదాపు 35 వేల మైళ్ళు.

* నెప్ట్యూన్ అనే గ్రహం 1846లో కనిపెట్టబడింది. ఇది సూర్యుడికి 279 కోట్ల మైళ్ళ దూరాన ఉన్నది. యురేనస్‌పైన పడే సూర్యకాంతిలో మూడోవంతు మాత్రమే ఈ గ్రహంపై పడుతుంది. గంటకు 186 మైళ్ళ వేగంతో నడుస్తూ, ఈ గ్రహం 165 యేళ్ళ కొకసారి సూర్యుణ్ణి చుట్టివస్తుంది. దీని నిడివి దాదాపు 33 వేల మైళ్ళు.

* ప్లూటో అనే గ్రహం 1930 మార్చి 13న కనిపెట్టబడింది. ఇదిసూర్యుడికి 367న్నర కోట్ల మైళ్ళ దూరాన వున్నది. దీనిమీద మనుషులుండి సూర్యుడికేసి చూస్తే సూర్యుడు కాంతివంతమైన నక్షత్రంలాగా మాత్రమే కనిపిస్తుంది. ఈ గ్రహం గంటకు 120 మైళ్ళ వేగంతో నడుస్తూ 248 ఏళ్ళ కొకసారి సూర్యుణ్ణి చుట్టివస్తుంది. ఈ గ్రహంకన్న చిన్న గ్రహం బుధుడు ఒకటే. దీని నిడివి 3600 మైళ్ళు.

* యురేనస్, నెప్ట్యూన్, ప్లూటో గ్రహాలు చలికి బిగతీసుకుపోయిన గ్రహాలై ఉండాలి. వాటిమీద ప్రాణి కోటి నివసించే అవకాశం లేదు. ఇవి టెలిస్కోప్ సహాయం లేకుండా కనబడవు.

* ఈ గ్రహాలలో ఉపగ్రహాలు లేనివి బుధుడు, శుక్రుడు, ప్లూటో. భూమికి ఒక్క ఉప గ్రహం—చంద్రుడు—మాత్రమే ఉన్నది. కుజుడికీ, నెప్ట్యూన్‌కూ రెండేసి ఉపగ్రహాలున్నాయి. యురేనస్ చుట్టూ 5 ఉపగ్రహాలున్నాయి. శని చుట్టూ తిరిగే ఉపగ్రహాల సంఖ్య 9. గురువుకు 12 ఉపగ్రహాలున్నాయి.

* సూర్యుడినుంచి బయలుదేరిన కాంతి ప్లూటోను చేరుకోవటానికి 5½ గంటలు పడుతుంది. (భూమిని చేరటానికి 8 నిమిషాలు పడుతుంది.) ఇది మనకు ఊహించలేనంత దూరంలాగా కనబడుతుంది. కాని, సూర్యకాంతి ప్లూటోను దాటి 4 సంవత్సరాల మూడు మాసాలు ప్రయాణించేదాకా దానికి మరొక గోళం తగలదు!



# ఇంద్రజాలము

నేను చిన్నతనంలో విద్యార్థిగా ఉంటూ ఈ ట్రిక్కు చేశాను. కాని ఈ వయసులో కూడా అప్పుడప్పుడూ నా మిత్రులకు చేసి చూపుతూంటాను.

బల్లమీద ఒక "మార్వెల్" కాగితం పరిచి ఉంటుంది. దానిమీద ఒక చిన్న నాణెం పెడతాను. తరవాత, అక్కడే బోర్లించిఉన్న గాజు గ్లాసుపై చేతిరుమాలు ఒకటి కప్పి, గ్లాసును నాణెంమీద బోర్లిస్తాను. చేతిరుమాలు తీసేసరికి గ్లాసుకింద నాణెం ఉండదు. మళ్ళీ గ్లాసుమీద చేతిరుమాలు కప్పి గ్లాసు ఎత్తి పక్కన పెట్టగానే, "మార్వెల్" కాగితంమీద నాణెం ఉండటం ప్రేక్షకులకు కనిపిస్తుంది.

ఈవిధంగా గ్లాసు బోర్లించినప్పుడు నాణెం మాయంకావటం, అది తియగానే నాణెం కనిపించటం ఎన్నిసార్లయినా చేసి చూపవచ్చు.

ఇక ట్రిక్కు రహస్యం. ఈ రహస్యం బల్లలోగాని, దానిమీద పరిచిన మార్వెల్ కాగితంలోగాని లేదు. అది గ్లాసులో ఉన్నది. మామూలు గాజు గ్లాసు తీసుకోండి. దాని అంచున మంచిరకం బంకపూయండి. తరవాత ఆ బంకపూసిన గ్లాసును, "మార్వెల్" కాగితంపై బోర్లించండి. గ్లాసు మూతి అంచు కాగితానికి అంటుకుపోతుంది.






ఆ తరవాత "మార్వెల్" కాగితాన్ని గ్లాసు మూతిచుట్టూ (బొమ్మలో చూపిన విధంగా) కత్తిరించండి. ఇప్పుడా గ్లాసుతో ట్రిక్కు చేయవచ్చు. ఈ గ్లాసును బల్లమీద, "మార్వెల్" కాగితంపై బోర్లించి ఉంచినప్పుడు గ్లాసులో నుంచి కనిపించే కాగితం బల్లమీద ఉన్న కాగితంలాగే ఉంటుంది గనక ప్రేక్షకులు తేడా తెలుసుకోలేరు. "మార్వెల్" కాగితంమీద బోర్లించి ఉన్నది మామూలు గ్లాసే అనుకుంటారు. తరవాత చిన్ననాణెం తీసి "మార్వెల్" కాగితంమీద పెట్టాలి. తరవాత గ్లాసుఎత్తి నాణెంమీద పెట్టాలి. కాని గ్లాసు ఎత్తినప్పుడు ప్రేక్షకులు, దానిమూతికి కాగితం ఉండటం కనిపెట్టేస్తారు. అందుచేత గ్లాసు ఎత్తక పూర్వం ఎవరిదగ్గిరైనా ఒక చేతిరుమాలు అడిగి పుచ్చుకుని, దాన్ని గ్లాసుమీద కప్పి తరవాతనే గ్లాసుఎత్తి నాణెంమీద ఉంచాలి. తరవాత చేతిరుమాలు తీసివేస్తే ప్రేక్షకులకు నాణెం కనబడదు. ఎందుకంటే గ్లాసుమూతికి అంటుకునిఉన్న మార్వెల్ కాగితం దాన్ని కప్పేస్తుంది. ఈ సంగతి ప్రేక్షకులకు తెలీదు గనక వారు, నాణెం మాయమయిందనుకుంటారు. గ్లాసు మీద మళ్లీ చేతిరుమాలు కప్పి దానిని ఎత్తినట్టయితే "మార్వెల్" కాగితం మీదవున్న నాణెం ఎప్పటిలాగే ప్రేక్షకులకు స్పష్టంగా కనిపిస్తుంది.

ఈ ట్రిక్కు చేసేటప్పుడు రెండు గ్లాసు లుంచుకోవటం మంచిది. అందులో ఒకటి పైన చెప్పినప్రకారం తయారుచేసుకుని ఉన్న గ్లాసు, మరొకటి మామూలు గ్లాసు. మంచి "మార్వెల్" కాగితం దొరకనిపక్షంలో ఈ ట్రిక్కును మందమైన రంగు కాగితంతోకూడా చేయవచ్చు.

[పాఠకులు, యీగారడీని గురించి సలహాలు పొందదలిస్తే, వారు 'చందమామ' పేరు ఉదహరిస్తూ, ప్రొఫెసరుగారి పేర ఉత్తరం రాయవచ్చు. ఉత్తరాలు ఇంగ్లీషులోనే రాయాలి.

వారి అడ్రసు యిది:- ప్రొఫెసర్: పి. సి. సర్కార్, మెజిషియన్, పోస్టుబాక్సు 7888, కలకత్తా-12.]

# గోడమీది బొమ్మ - 6 (ఆఖరి చివరి బొమ్మ)

భార్యా భర్తలిద్దరూ తెల్లవార్లూ కూచుని ఒక పడవ చేశారు. దాని వెనుక భాగం ఉక్కులాగా, అంచు పదునుగా ఉండేటట్టు "జ్యోతి" తయారుచేసింది. మర్నాడు పందెంలో చ్యాంగ్ పడవ ముందుకు పోవటం గమనించి, చక్రవర్తి దుర్మార్గంగా తన పడవను చ్యాంగ్ పడవకు ఢీ కొట్టాడు. వెంటనే చక్రవర్తి పడవ ముందు భాగం చీలిపోయింది.

చక్రవర్తి నదిలో మునిగి చచ్చినంతపని అయింది. మంత్రులూ, తదితరులూ ఆయనను ఎలాగో బయటికి లాగారు. "చూడు, నా దుస్తులెలా తడిసి పాడయాయో! మూడురోజుల్లోగా రంగురంగుల పక్షి ఈకలతో మరొక కోటు అల్లించి తీసుకురాకపోయావో, నీ తల తీయించేస్తాను. ఆ కోటుమీద రకరకాల బొమ్మలూ, సూర్యుడూ, సముద్రమూ చిత్రించాలి!" అన్నాడు చక్రవర్తి చ్యాంగ్‌తో.

"జ్యోతీ", చ్యాంగ్ కలిసి కాగితం పక్షులు రకరకాలవి కత్తిరించారు. "జ్యోతి" వాటిని ఎగరవేసేసరికి అవన్నీ నిజమైన పక్షులుగా మారి రంగురంగుల ఈకలు బోలెడన్ని రాల్చాయి. వాటితో "జ్యోతి" చక్రవర్తికి కోటు తయారుచేసి, వాటిమీద రకరకాల బొమ్మలు కుట్టుపని చేసింది. ఇంతలో మూడురోజుల గడువయిపోవచ్చింది. ఇంకా సముద్రమూ, సూర్యుడూ తయారుకాలేదు. ఎలాగా అన్న విచారంతో చ్యాంగ్ కన్నీరుకార్చాడు. ఆ కన్నీరు కోటుమీదపడి సముద్రమయింది. బొమ్మలు కుట్టటంలో "జ్యోతి" వేలికి సూది గుచ్చుకుని రక్తంకారి అది సూర్యుడయింది.

కోటు చూసి చక్రవర్తి చాలా ఆనందించాడు. ఆయన "జ్యోతి"తో, "ఈ కోటు ఎలా తయారుచేశావో చూడాలని వుంది. నే చూస్తూండగా మరొకటి తయారుచెయ్యి," అన్నాడు. "ఇది వేసుకుచూడండి. కొలతలు సరిగావుంటే, ఒకటికాదు, పది తయారుచేస్తాను," అన్నది "జ్యోతి".

సరేనని చక్రవర్తి కోటు ధరించాడు. "జ్యోతి" ఆ కోటుపై ఊదింది. వెంటనే దానిమీది సముద్రం నిజమైన సముద్రమయింది. ఆ సముద్రంలో చక్రవర్తీ, అతని మంత్రులూ అంతా మునిగిపోయారు. ఒడ్డున నిలబడి చ్యాంగ్, "జ్యోతీ" ఎర్రగా సముద్రంలోనుంచి ఉదయించే సూర్యుణ్ణి చూడసాగారు. ★

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1956 ఫిబ్రవరి సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.

★ డిసెంబరు 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## డిసెంబరు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: తన యింట్లో తను తిన్నా...

రెండవ ఫోటో: లోకానికి వెరవాలి!

పంపినవారు: కె. ప్రభాకరరావు c/o శ్రీ కె. సీతారామచంద్రరావు, సూర్యాపేట.

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.



# వార్తలు-విశేషాలు

ఆంధ్రలో నిర్మింపబడ నున్న నాగార్జున సాగర్ప్రాజెక్టు నిర్మాణానికి మొత్తం 122 కోట్ల రూపాయలు ఖర్చుకాగలవు. ప్రాజెక్టు నిర్మాణంలో తొలి ఘట్టానికి 75 కోట్ల రూపాయల పెట్టుబడి అవసరమవుతుంది. ఈ ప్రాజెక్టుకై ప్లానింగ్ కమిషన్ తాత్కాలికంగా కేటాయించిన మొత్తం 34 కోట్ల రూపాయలు.

*　　　*　　　*　　　*

మన రైతులకు జపాను పద్ధతిలో వరిసాగు చేయడంలో సహాయపడుటకు జపాను నుంచి 9 మంది యువకులు పాట్నాకు రానున్నారు. వీరిని జపాన్ బౌద్ధసంఘం పంపుతున్నది. వీరికయ్యే ఖర్చును, బీహారుప్రభుత్వం భరిస్తుంది.

*　　　*　　　*　　　*

మన ప్రభుత్వ ఆహ్వానంపై సోవియెట్ప్రధాని మార్షల్ బుల్గానిన్, సోవియెట్ కమ్యూనిష్టుపార్టీ ప్రథమకార్యదర్శి మిస్టర్ కృశ్చేవ్, విమానంలో మాస్కోనుంచి నవంబర్ 18వ తేదీన ఢిల్లీకి వచ్చారు. పాలం విమానాశ్రయంలో వీరికి ప్రధాని నెహ్రూ, వైస్ప్రెసిడెంట్ డాక్టర్ రాధాకృష్ణగార్లచే ఘనస్వాగతం యివ్వబడింది.

*　　　*　　　*　　　*

సుప్రసిద్ధ భారతీయ వృక్షశాస్త్రవేత్త, ప్రొఫెసర్ బీర్బల్ సహానీ రచించిన గ్రంథాలు, కెయిరో విశ్వవిద్యాలయానికి బహూకరింపబడినవి. లక్నోలోని బీర్బల్ సహానీ పేరుతో వున్న వృక్ష శాస్త్ర సంస్థ తరపున శ్రీ మతి సావిత్రి సహానీ యీ గ్రంథాలను బహూకరించారు.



మన దేశంలో 1951 అక్టోబరులో పనిప్రారంభించిన సింద్రీ ఎరువుల కర్మాగారం యీ నాటివరకు మొత్తం 90 లక్షల టన్నులపైగా ఎరువులు ఉత్పత్తిచేసింది. ఈ ఎరువుల వాడకంవల్ల దేశంలో 55 కోట్ల రూపాయల విలువచేసే 10 లక్షల టన్నుల ఆహారధాన్యాలు అదనంగా ఉత్పత్తి అయినవి.

*　　　*　　　*　　　*

విద్యార్థులకు చెడుగుడు ఆటలో శిక్షణ యివ్వడానికై, జబ్బల్‌పూర్‌లో ఒక శిక్షణ కేంద్రం స్థాపించబడింది. ఈ కేంద్రంలో శిక్షణపొందే నిమిత్తం దేశంలోని ఎనిమిది విశ్వ విద్యాలయాలనుంచి విద్యార్థులు వచ్చి చేరారు. వీరిలో ఆంధ్రవిద్యార్థులుకూడా వున్నారు.

*　　　*　　　*　　　*

మద్రాసులోని పెరుంబూర్ రైల్వే కోచ్‌ఫ్యాక్టరీలో నిర్మించబడుతున్న ఉక్కు రైలు పెట్టెల మొదటిజట్టు తాలూకు, మూడు నాలుగు పెట్టెలు కొద్దిరోజులలో ఫ్యాక్టరీనుంచి బయటికి వస్తాయి. ఈ ఫ్యాక్టరీకి గడచిన అక్టోబరు 2వ తేదీన ప్రధాని నెహ్రూ ప్రారంభోత్సవం జరిపారు. ఈ ఫ్యాక్టరీ పెట్టుబడి ఏడు కోట్ల 30 లక్షలు.

*　　　*　　　*　　　*

జెమ్‌షెడ్‌పూర్‌లో 13 కోట్ల డాలర్ల ఖర్చుతో ఒక ఉక్కు ఫ్యాక్టరీని నిర్మించటానికి, టాటా ఐరన్ అండ్ స్టీల్ కంపెనీతో, ఒక అమెరికా సంస్థ ఒడంబడిక కుదుర్చుకొన్నది. ఈ కొత్త ఫ్యాక్టరీ ఉత్పత్తి ప్రారంభించినప్పుడు, నూరింట 45 వంతులు దేశంలో ఉక్కు ఉత్పత్తి పెరగగలదట.

*　　　*　　　*　　　*

నవంబర్ 11వ తేదీన తిరుపతిలో, ప్రెసిడెంట్ డాక్టర్ రాజేంద్రప్రసాద్ సంస్కృత విశ్వపరిషత్తు మహాసభలకు ప్రారంభోత్సవంచేశారు. 1500 మందికిపైగా పండితులు, సంస్కృత భాషాప్రియులు, ఈ సభలకు హాజరయారు. 1951 సంవత్సరంలో ఈ సంస్కృత విశ్వపరిషత్తు స్థాపింపబడింది. దక్షిణభారతదేశంలో యిట్టి సభలు జరగటానికి యిదే మొదటిసారి.



# చిత్రకథ



పండగరోజున దాసూ, వాసూలు పెద్ద రొట్టె ఒకటి సంపాయించారు. "దీన్ని, యిట్టే తినేస్తే ఏముంది? దీనితో కాసేపు వాలీబాల్ ఆడితే, కరకరా ఆకలేస్తుంది," అన్నాడు వాసు. దాసు సరేనన్నాడు. ఇంకేం, ఆట ప్రారంభించారు. "టైగర్" తన అవకాశంకోసం కాచుకు్కుచుంది. దాసూ, వాసూలు రొట్టెను బంతిలా కిందికీ మీదికీ కొట్టసాగారు. ఆట చాలాసేపు సాగింది. కాని ఒకసారి రొట్టె గురితప్పి కిందపడేలోపల, "టైగర్" దానిని నోటకరుచుకుని పరిగెత్తింది. పాపం, దాసూ వాసూలకు మిగిలింది తీరని ఆకలి మాత్రం



Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him for Chandamama Publications, Madras 26. Controlling Editor: SRI 'CHAKRAPANI'

Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

లోకానికి వెరవాలి !

పంపినవారు:
కె. ప్రభాకరరావు, సూర్యాపేట